# అంకితము

శ్రీ శ్రీ రాజా రామచంద్ర అప్పారావు బహాదూర్ జమీన్‌దారుగారికి

కస కస నూరి త్రాగినది కాకతి శత్రుల క్రొల్మదంబు నా
బసవన దండనాయకుని బాహున తజ్జ మహాగ్ని రేఖగా
మసలి మొదల్, నవచ్ఛవుల మాగి పయిన్ విజయప్పరావు దో
రసి, నొక వెల్గు తెల్గు వెలమాభిధ మేలెను కృష్ణయోద్ధునన్.

ఆత్రియా మను మార్గగులందు నేడు
రాత్మజులతోడి శోభనాద్ర్యప్పరావు
ముందు నేడుసంద్రములతో మొరసికొన్న
వరుణు డేమి టన్నంతలో వాడె యయ్యె

నారయ రామచంద్రులని నల్గురుగా చను నప్పరావులం
దారయ రామచంద్రప్రభు వాతోలికోవను నేటిపెద్ద యే
కారునన్నైన తోలిన శికారున పందినిచంపుబంటు గా
భారతి నూత్న నూత్న కవితావనితా హృదయాధి నాథుమున్

ఆ ప్రభుమణికి నౌదార్య దీప్రఖనికి
ఆ కవిమణికి గాఢోహాలోకఖనికి
అంకితం బప్పరాయ వంశాబ్ధిమణికి
అంకితము రామచంద్ర గుణైకఖనికి



# అనార్కలీ

## నాంది

నాసాంతే కృతదృష్టి రవ్యవహితభ్రూర్వ్యాఘ్రచర్మాసనే
నిష్ఠామర్దిత బాహ్యవస్తువిషయా యా బ్రహ్మరంధ్రోద్గతైః
తేజోభిర్భృశమైందవైః ప్రచలితైః మూర్ధాన్య వృతేవాంశుభిః
సర్గస్థిత్యపహారహేతు రవతాత్ శైవార్ధసీమంతినీ

సూత్రధారుడు (ప్రవేశించి)

నూత్నమార్గ విరచిత దృశ్యకావ్య దిదృక్షువులు వ్యంగ్యవేత్తలు నగు పారిషదుల కొక మనవి. ఆర్యమిత్రులు తమతో మనవిచేయుమని నాకు గురుస్థానమైన యీ మహాకవి నన్నిట్లాజ్ఞాపించినాడు. ఆయన మాటలివి.

తేపకు తేపకున్ మొలకదేరిన భక్తిని మత్పితృప్రతి
ష్ఠాపిత శైవలింగము కడంక భజించెద నాత్మవారణా
సీ పురినేత భృంగిరిట శిష్యుని దిగ్వసనున్ త్రిలోకర
క్షాపతి నందమూరుపురసక్తు మదశ్రికణాలి హేతువున్

అమృతపదార్థముఁ దెలిసినట్టి యోగులు తన్మనోఽంబుజ
భ్రమరము నున్మనీ చరమభాగవిరాజిత బిందుశేఖర
స్థము పరతత్వమం చెఱుక చాలియు చాలక చాలకే రఘూ
త్తమునిగ నెంతు మంత్ర మహితాక్షరబద్ధసుమూర్తినిత్యముఁ

శైవాంశం బని చెప్పనా దశశిరస్సంత్రాసచండాకృతిఁ
శ్రీవాయూద్భవు డందునా యనిలు శాసించెఁ మహాయోగియై
పో వో కేసరి కోతికూన యననా ముక్తేంద్రియభ్రాంతు న
న్నావేశించిన రామచంద్ర పదపద్మాధీన చేతస్కునిఁ

అని యస్మదిష్టదేవతాప్రార్థనాసిద్ధిరూపంబున నీ నూత్నమార్గకృతికి సాంప్రదాయానుబంధంబు కలిపించుకొని మచ్ఛిష్యుడైన యీ నటకావతంసుని విజ్ఞానము నాశ్రయించి యీ దృశ్యకావ్యమునకు సప్రదర్శనయోగ్యతాదోషము పరిహరించుకొని యిందలి పూర్వాంకమునందలి రచనాపద్ధతికి వ్యాఖ్యానప్రాయముగ రెండుమాటలు చెప్పెదను. ఇందు వసంతుడు పూలకన్నెలు మన్మథుడు చిలుక కోకిల కవి మొదలైన పాత్రలు వత్తురు. వీరందరు నాయికా నాయకుల సమక్షమందే వచ్చెదరు. మన పూర్వకావ్యములందు వీని నుద్దీపన విభావములుగా చెప్పిరి. ఆ యుద్దీపనవిభావము వెనుకనున్న మానసికస్థితి యీ యీ పాత్రలవాక్కులందు వారి మాటలుగా గ్రుచ్చబడినవి. కవి నాయకునిలోననే యొక భాగము. అతడు బయటి కింకొక పాత్రవలె కనుపించును కాని, కథానాయకుడు కానిసలీము, ఒక మహోత్కృష్ట భావ పరం

పరాలగ్నబుద్ధి యగు సలీము, కవిగా కనిపించుచున్నాడు. చిలుక కోకిల మొదలైనవి పలికిన పలుకులు వానియందున్న యర్థమును నాయికానాయకులు సంకల్పించుకొనిరి. ఆ భావములే చిలుకలు కోకిలలు పుష్పకన్యకలు చెప్పినట్లిందు వ్రాయబడినది. తక్కిన కావ్యగుణములకుగాని దోషములకుగాని రసజ్ఞులే ప్రమాణము. నాయెడల ప్రసన్నురాలైన

ఝుణ ఝుం ఝుణ ఝుం ఝుణ ఝుణ
ఝుణా ఝుణా ఝుణ మనోజ్ఞ సంరావిత కిం
కిణీ పద, సుమరద, తాండవ
చణ శారద మన్మనోఽచ్ఛ జలధి మథింతుర్

ఇవి మద్గురువర్యులు తమతో మనవి సేయుమన్న మాటలు. అల్పజ్ఞులమైన మేము వారి బోధనచేతకాక యీ నూత్నరచన ప్రదర్శించనేలేము. తత్ప్రసాద పరివర్ధమాన ప్రజ్ఞా దురంధరులమగు మాకు స్వర్గలోకమువలె సుమనోఽభిరాములైన పారిషదులు తమ ప్రసాదము కూడ కలిగెనేని చెప్పవలయునా అన్యోన్య లగ్నబుద్ధులగు నాయికానాయకులకు వసంతాగమము ప్రాప్తించి నట్లే. సెలవు

(నిష్క్రమించును)

ఇది ప్రస్తావన

## రంగము ౧

వసంతోద్యానము

సలీము

ఆకన్నుదోయిలో స్వర్గజ్యోతిస్సులు వెలుగుచున్నవి.

ఏమా సౌందర్యము!

ఈ మావిగున్న యింత విరియవ్రాయవలెనా! నా మనస్సీ చివురాకుమీదనే నిలుచుచున్నది.

అనార్కలీ

నెమ్మది నెమ్మదిగ విచ్చు మల్లికాకుసుమము వలె ముహూర్మ్ముహూర్న్నవీకృత శోభాయమానముగ నున్నది!

శరత్పూర్ణిమాయామినివలె స్వచ్ఛముగా నున్నది!

మక్కానగరగోపురముపోలిక స్వర్గశిఖరముతలపించుచున్నది!

అతని సౌందర్యమేమి!

చివురుకన్నె

మసృణ సంధ్యాకాల మధుర కాంతులలోన
ఘుసృణమందార సంకుమదరోచులలోన
దాచుకున్నాను నాతరుణారుణచ్ఛాయ
వేచుకున్నాను నావిభునిరాకలదాక

ముసలి సంజలతమ్మి మొగ్గమూతలలోన
కసటుప్రొద్దుటి లేతకలువవేపులలోన
నాకన్నె సిగ్గుటండము దాచుకొన్నాను
నాకంఠమాల ప్రాణపతివచ్చెడుదాక

పసిలేడిచొక్కంపు పాలబుగ్గలలోన
నుసలని సెలయేటి నురుసునవ్వులలోన
పదిలించుకొంటి నా ప్రాయంపు మిసిమెల్ల
మదనమోహనుడు నా మధువురాకలదాక

రేపు వచ్చును సామి మాపు వచ్చును సామి
యీపూట తప్ప దం చిన్నాళ్లు వేగగా
సౌందర్యమునకన్న సౌందర్యపుంగుప్ప
యిందు రానేవచ్చె నీమనోహరమూర్తి

రావమ్మ నవమల్లె రావమ్మ మాగధి
రావమ్మ మాధవి రావె శేఫాలికా
రావమ్మ పున్నాగ రావమ్మ మాకంద
రావమ్మ యిందీవరంబ ముద్దులగుమ్మ

రండు రండమ్మ పేరంటాండ్రు మీరెల్ల
దండలై మదనసుందరుడు రానే వచ్చె
స్వామి నీకొరకు పూజాద్రవ్యములు తెచ్చి
యేము కాచెదము రావే మోహనాకార

### వసంతుడు

ఇది యువస్పృతిమోము నదిమి కొన్నపరాగ
మిది సంజలేగటాఁ బొడుగుశోభారాశి
యిది పూపకన్నెలో పొదలు తేనెలవాక
యిది రసాంభోరాశి పదునుగొన్నకణంబు

### పుష్పకన్యకలు

ఇతడు మావిచివుళ్ళ నెగచి వేసినజోదు
ఇతడె యందపుగోన లెల్ల మ్రుచ్చిలురాతు
సెలయేళ్ళయిసుకతిన్నెల నేలురా జితడె
ఇతడె ప్రాతఃకాల సతిమేన సితరోచి

### మాధవి

చేరిరారే ప్రదక్షిణముగా స్వామికి
మీరు కేళ్యుద్యాని మేలికన్నియలార !
మొన్నాళులకు వచ్చె నీదయావనరాశి
కన్నులవత్తులై కాగిపోతిఁగదమ్మ.

### మాగధి

పూవసంతాలమ్మ పూవసంతాలు
మావనాంతములందు మధులతాంతాలు
తల్లి క్రొంబొదుగువద్దకుఁ బోవు పసిలేడి
మెలగా డెందు స్వామికి నాడుకొనుటకు

## శేఫాలిక

కస్తూరికొనిరండు కైవసంబయినాడు
శిస్తుపూయుదమ యీ చిత్తేశు డీనాడు

## అందఱు

చిలుపవానలకు పరువులు పెట్టిన సెలల యిసుకపొరలో
మొగలితావి పస బుగులుకొన్న పుప్పొడులమేలి తెరలో
కలసియాడుదము పాటలుపాడుచు మలగిపోవుదము వనిలో
జిలుగుపూ లెసగుపచ్చనిబయలులఁ గలసిపోద మామనిలో

## పుష్పకన్యకలు

బాలమృణాలీలీలకరా - మ
త్తాళిమనోహరనీలకచా! - స
మ్మోహనవనీపుంకీకృత దేహా! (నృత్యము)

చిలుపవానలకు పరువులు పెట్టిన సెలల యిసుక పొరలో
కలసి పోవుదము పాటలుపాడుచు మలగిపోవుదము వనిలో
(నృత్యము)

## కవి

శ్రీఖండానిలగంధసంకలితమై శేఫాలికామాధవీ
రేఖామంజులవాసనాలహరి పర్వెన్ ప్రాతరానీతశో
భాఖద్యోత విలాసరాగ లలితప్రాంశుప్రభల్ చూతస
చ్ఛాఖాపల్లవరాజి కెంతయుఁ బరిష్వంగమ్ములై వాల్చెడిన్

ఈమలయానియంబులు వహించివ శైత్యములెంతధూర్తముల్
లేమల తాపమెల్లఁ బదిలించుకొనెన్ దమలోన మందమం
దామలయాన వైఖరుల కబ్బిన పాంథవిలాసినీ మనః
కోమలతాపదంబు లుడుకున్ నడివేసగి పల్లవంబులై.

ఊరక నాహృదంతరము నూచెడుఁ గోరిక లేక రక్తపుం
నీరజపత్త్ర కాంతులకు నెయ్యములై తగుఫాల్గుణాంతవే
ళారుచిరంబులై యుదయ లాలితనవ్యవనీవసంత శో
భారమణీయమైన నవపల్లవరక్తిమ మెంతక్రమమో.

రంగము ౩

మిత్రుడు

ప్రభూ! ఏమి విచారించుచున్నారు?

సలీము

మిత్రమా! అనార్కలీ యనగా నేమి?

మిత్రుడు

దానిమ్మపూవు.

సలీము

అది గులాబికన్న మల్లెకన్న రమ్యమైనదా?

మిత్రుడు

ఏ పూవున కాపూవే. ఏ పూవురమ్యత దానిదే.

సలీము

గులాబి మల్లెలలో వాని సౌందర్యమునకు వానివాసన సహాయకారి యగుచున్నది.

మిత్రుడు

వాసన లేకున్నను గులాబి మనోహరమైనదే

సలీము

దాని వాసనచేత నిదివరకే సమాకృష్టమైన నీ హృదయము దానియందలి పక్షపాతమును వీడజాలదు. జన్మతః గల వాసన చేత గులాబిని మల్లెను మనము మిక్కిలిగౌరవించుచున్నాము. వానిని వాని వాసనకు గౌరవించుచున్నామే కాని వానిసౌందర్యమునకుగాదు. సౌందర్యము కూడ నున్నదా, యుండనిమ్ము. వాసనావిరహితములైన ప్రసవములలో నున్న సౌందర్యము పక్షపాతముచేత మన మొప్పుకొనునది కాదు. అనార్కలీని చూడుము. దాని రక్తిమ, దాని సౌందర్యము! నా మనస్సునంతకంతకు వశపఱచుకొన్నది.

మిత్రుడు

అవును ప్రభూ! తాము మునుపటివలె మావితోటలకుబోయి క్రొత్తయంట్లు కట్టుటనుగూర్చి విచారించుటలేదు. శిల్పులను పిలిచి వారితో శిల్పప్రసంగములు చేయుటలేదు.

సలీము

నా మనస్సు ననార్కలీ యాక్రమించుకొన్నది.

మిత్రుడు

సరే! ఇంక దానిమ్మతోటలు వేయించి యందుగూడ నొక క్రొత్తవిధమైన ఫలములు గనుగొనుడు.

సలీము

(మౌనము)

మి త్రు డు

ప్రభువు లన్యాయ_త్త చిత్తులై యున్నారు.

స లీ ము

ఆమె యన్యకాదు. అవివాహిత

మి త్రు డు

ఆమె యెవరు ?

స లీ ము

అనార్కలీ.

మి త్రు డు

స్వర్గవాహిని చవిటిపఱ్ఱలమీద బ్రవహించుచున్నది

స లీ ము

ప్రేమ వాహిని వంటిది. దానికి నిమ్నోన్నతత్వములు సమానము.

మి త్రు డు

(మౌనము)

## రంగము 3

అనార్కలీ

అజీజ్! ఇప్పు డెంత ప్రొద్దు వోయినది?

అజీజ్

రెండు ఝాము లైంది.

అనార్కలీ

నాకు నిద్ర వచ్చుటలేదు.

అజీజ్

ఎంచేత?

అనార్కలీ

మనస్సున నేదియో యావేదనగా నున్నది.

అజీజ్

దీని కౌషధముంది చెప్పనా?

అనార్కలీ

ఊఁ.

అజీజ్

భరతపక్షి వుండే. అది గుడ్లుపెట్టి మేత కెళ్లినపుడు నెమ్మ దిగా చెట్టుమీాది కెక్కి, అందులో ఒకగుడ్డుకి చిన్న బెజ్జం చేసీ, అందులో రసంఅంతా ఓడ్చేసీ, దాన్నిండా పాదరసం

పోసి యేం యెరగనట్టుగా దిగిరావాలి. తల్లివచ్చి తనగుడ్లు సరిగానే వున్నవని సంతోషిస్తుంది. మనం పాదరసం పోశా మని తెలియదుగా! అది తనగుడ్లను పొదుగుతుందా! మన పాదరసంగుడ్డునుగూడా పొదుగుతుంది. మన పాదరసంగుడ్డు తెల్లని పిట్టవుతుంది. ఆపిట్టయీాకలు తెచ్చి అవికాల్చి బూడిద చేసీ తేనెలో కలిపి పొద్దునా సాయంత్రం ఒకమండలం రోజులు సేవిస్తే యెటువంటిరోగం నిమిషంలో కుదురుతుంది.

అ నా ర్క లీ

ఈ మందు నీకెవరు చెప్పినారు ?

అ జీ జ్

సారాదుకాణంవాడు

అ నా ర్క లీ

మరల నక్కడకు వెళ్లుచుంటివా ? నేను వెళ్లవద్దని చెప్పితిని గదా !

అ జీ జ్

ఊరికే వెళుతున్నాను. తాగడంలేదు. కాని తాగితే యేం ? ఎంతో వుత్సాహంగా వుంటుందే

అ నా ర్క లీ

లోపల నరములును మాంసమును చెడిపోయి మృత్యువు శీఘ్ర ముగా తటస్థించును

అ జీ జ్

ఇంతేగదా ?

అ నా ర్క లీ

ఏ మట్లంటివి ?

అ జీ జ్

చచ్చిపోతే బతికించడానికి నాదగ్గిర మందుందిగా.

అ నా ర్క లీ

అదేమిటి ?

అ జీ జ్

జెముడు కాకి వుందా, అది మేతకెళ్ళినప్పుడు దానిగూ డెత్తుకొచ్చి గంగలో పారేస్తే అందులో సంజీవిపుల్లని ఒకటుంటుంది. అది ప్రవాహాని కెదు రీదు తుంటుంది. అది తీసుక వచ్చి చచ్చిపోయినవాళ్లకి ముట్టిస్తే అందరూ లేచి కూర్చుంటారు !

అ నా ర్క లీ

నీకు చదువు చెప్పెదను. నేర్చుకొందువా ?

అ జీ జ్

నాకు చదువుతోవాళ్నే వుంది

రంగము ౪

రసీ

అనార్కలీ ! నీవు చాల యందకత్తెవు

అనార్కలీ

రసీ ! నీవు చాల తీయని దానవు

రసీ

నీయంత ప్రశస్తమైన దానను కాదుగా !

అనార్కలీ

అనార్కలీపసందు అనార్కలీది. రసీపసందు రసీది. ఇది పూవు, అది పండు

రసీ

పూవును కాయ కాచి పండు గాక యెప్పుడును పూవుగానే యుండునా ?

అనార్కలీ

పూవు పూవు గానే మాడి పోవచ్చును

అజీజ్

మాడి పోయినా పువ్వు పువ్వే. దాని వాసనతో నాలుగు దిక్కులూ గుబులాడి పోతై

## రంగము ౫

అనార్కలీ

మిత్రమా! మరల వచ్చితివి

రునీ

ఉస్తాదు మరల పంపించినారు

అనార్కలీ

అయ్యో నాకేమియు నోపికగాలేదు

రునీ

పాఠశాల చూచుటకు వచ్చునది యువరాజు సలీము గారట

అనార్కలీ

(మౌనము)

రునీ

ఏ మందువు?

అనార్కలీ

నీ యిష్టము

రునీ

తప్పక రప్పించుమని

అ నా ర్క లీ

అంతవరకు వచ్చినను నృత్యము చేయలేనేమొ!

రు సీ

నీవు వచ్చిన చాలునన్నారు ఉస్తాదుగారు

అ నా ర్క లీ

గుర్వాజ్ఞ బలవత్తరముగానున్నది. (కొంచె మెడము.)

రు సీ

స్నానమైనదా?

అ నా ర్క లీ

ఆఁ.

రు సీ

దుస్తులను వైచుకొని కన్నులకు గాటుక దిద్దుము. ఇదిగో నృత్యశాల

అ నా ర్క లీ

ఓపిక లేని నేను నృత్యము చేయు చున్నప్పుడు కాలుజారి పడెదనేమో!

రు సీ

భయము లేదు

అ నా ర్క లీ

నా హృదయము కొట్టుకొనుచున్నది

రసీ

భయము లేదు

అనార్కలీ

నా కంఠము వణకి పోవునేమొ!

రసీ

మాటలాడకుండ గూర్చుండుము. ఇంతలో కబురు వచ్చును

ఉస్తాదు

జహాపనాహ్! క్షమించుము

సలీము

చెలికాడా! ఫర్మానా చూపించుము

(ఫర్మానా కళ్లకద్దుకొని) ఉస్తాదు

జహాపనాహ్! బిడ్డకు జ్వరముగా నున్నది. తమ యాజ్ఞా బలమే యామెను రప్పించినది. తప్పులు క్షమించవలయును

మిత్రుడు

ఫరవాలేదు. కానిండు

ఉస్తాదు

బిడ్డా, అనార్కలీ!

అ నా ర్క లీ

నీ పదమ్ములయంద నిలిచి యున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయనాథ!
ఈ మహోఝరియందు నీదు లాడగనైన
కాలు చేతులు రావు కరుణించవే నాథ!
హేనాథ! నీపాద మీా దాసి కన్నీట
కలుషితం బైనచో క్షమియింపవే నాథ!
ఈ తుమ్మపువుకన్న యెంత బేలయొ కాని
భృంగరాజునుజూచి బెంగ కొన్నది చూడు
హేనాథ! హేనాథ! హేదయావనరాశి
కలుషాత్మ యగు దీని గాల్చివేయుమునాథ!

(మూర్ఛ)

ఉ సా దు

రసీ! రసీ!

మి త్రు డు

అయ్యో!

ఉ సా దు

ప్రభువుగూడ మూర్ఛపోవుచున్నాడు. దయావనరాశి యీా మహారాజు

## రంగము ౬

### సలీము

నీ పదమ్ములయందు నిలిచియున్నది మనసు
ఆపదుద్ధారకా! ఆనందమయనాథ!

ప్రాణప్రియా! నాహృదయమును నీయందే నిలచియున్నది. మాతండ్రిచే కఠినముగా విధింపబడిన నాప్రవర్తనము నిన్ను నేను దర్శించుటకుగూడ వీలులేకుండజేయుచున్నది. అప్పటికిని నృత్యమును జూడవలె నను మిషచేత నిన్ను దర్శించుటకు వచ్చితిని. అపుడు నాదురదృష్టముచేత నీవు జ్వరార్తవై యుంటివి. అప్పటి నీజీర్ణశృంగారము నాకనుల కంటగట్టినట్లున్నది. మనోహారిణీ!

దేవీ! ఇదిగో! ఈప్రకృతి వికసించినది. నీహృదయము నాయెడల వికసించలేదేమి? నీవు నాయెడల నెట్టిభావములు గలదానవో తెలిసికొనకుండ నిన్ను దేవీ యని సంబోధించుచుంటిని, క్షమింపుము.

నీ కీ బానిసవృత్తి లభింపజేసిన దైవ మెంతే యనుల్లంఘనీయముగ నున్నది. నీవు బానిసవు గాకపోయినచో నీ విషయము నాతండ్రితో జెప్పి మనయిర్వురము నాయన యనుమతిమీాదనే

వివాహము చేసికొనెడివారము. ఇప్పుడు వారి యనుమతి లేదు గాన మన సమాగమము దూరమగుచున్నది.

నిన్ను చిన్నతనములో తెచ్చి బానిసగా నమ్మినవాడెవ్వడు? నీ వేయింట నుద్భవించితివో తెలియదే! ఏ సత్కులమునందైన నే సంపన్నగృహస్థు నింటనైన నీవు పుట్టినచో నా దుర్మార్గుడు నీ కెంత మహోపకారముచేసినవా డగుచున్నాడు

ఆహో! ఈ బానిసవృత్తి యెంతచెడ్డది! చక్రవర్తులుగూడ భోగలాలసులై యిదియే పనిచేయుట యెంత దేశారిష్టదాయకము! ఈ వృత్తికి రాజులు సానుకూలపడుచున్నారు. చక్రవర్తులు ప్రోత్సహించుచున్నారు.

కానిమ్ము! బానిస మనుష్య కాకపోయినకదా? భగవంతుని యొక్క చిద్విలాస మామెలో లేకపోయినదా? ప్రేమ యను నమృతపదార్థ మామెలో దొరకదా?

ప్రియా! నీకు దత్తమైన నా హృదయము మరల నేను లాగుకొనలేకున్నాను

అనార్కలీ బానిసకూతురు. నేను చక్రవర్తి కుమారుడను. మా యిరువురివివాహము రాష్ట్రమునకుగాని, రాజునకుగాని యనుమతి యెట్లు? ఇట్టి సంబంధము గలిపించుకొని నా తండ్రికిని రాష్ట్రప్రజలకును నిష్టములేని పని యేల చేయవలయును? మానుకొందునా?

పు ష్ప క న్య క లు

ప్రాతర్వికసిత పంకజనిర్గత
బంధుర రమణీయామోదంబులు
నీలో దాగెనులే

వ సం తు డు

ప్రాలేయాంచిత పాథోబిందులు
మీలో దాగెనులే

పు ష్ప క న్య క లు

బాలమృణాలీ లీలకరా-మ
త్తాళి మనోహర నీలకచా-స
మ్మోదవనీ పులకీకృతదేహా (నృత్యము)

పు ష్ప క న్య క లు

కై దండలుగొని కమలపరాగము లాడట విసరెడు సరసులలో
పోదము మలయసమీరము సారము పొల్చుకొన్న దారులలో

వ సం తు డు

సిగ్గేటికి వాసంతిక రావే చేబూనవె నా ప్రాణసఖీ
ముగ్గులు వెట్టితి పరాగసంతతి పూలువిరియు నీవనిలో

అం ద రు

చిలుపవానలకు పరువులు పెట్టిన సెలల యిసుకపొరలో
కలసిపోవుదము పాటలు పాడుచు మలగిపోవుదము వనిలో

### సలీము

ఆహా! ఏమా సౌందర్యము! తలంచుకొనినకొలది నా యీ యూహాలు వమ్మైపోవునట్లు తోచుచున్నది. అయినను నేమి చేయుదును. నామన స్సింత బేలయగునేమి! ప్రియా! అనార్కలీ మనోహారిణీ!

### కోకిల

వికసించిన వసంతసుకుమారకుసుమముల్
ప్రకృతియందున నూత్న పరిణామమును పొందె
నా మనోహర గీతికా మరందము గ్రోలి
యేమందు పులకితంబే యయ్యె విశ్వంబు
కామినీ కంఠసంగత మైన బాహువు
రామణీయక మెల్ల రాణించుకొన్నది
ప్రకృతిలో తన యాత్మ ప్రతిఫలించుట చూచి
భగవంతుడునుగూడ పులకితుండైనాడు
సకలస్వరమ్ము లాశానినాదము మాని
పంచమ స్వరములోపల నైక్యముం బొందె

### సలీము

ప్రణయినీ! నీవే నేను; నేనే నీవు; మన యిర్వురకును భేదము లేదు. నీ లతాకుసుమబాహువులు నా కంఠము చుట్టును పెన వేయుము. మనోహారిణీ! ఈ కృత్రిమమైన యారామము నందే వసంతు డిట్లు విజృంభించినాడు. ఇంక ప్రకృతి రమణీ

యములగు మహారణ్యము లెట్లున్నవో. వసంతుడా! నీవు నన్ను లొంగించుకొన్నావు. నీకు జోహారు! జోహారు!

మా యిరువురి యాత్మలు నొకటినై మ్రోగినవి కాని బాహిరమైన యీ భేదము దృశ్యమగుచునే యున్నది. ఏమి చేయుదును?

కవి

శ్రీమంతంబగు నీవసంతము వికాసించెన్ నవోద్యానపున్
సీమాంతంబుల మావిపూవు లివి వాసించెన్, పువుల్ వాసనా
ప్రామాణ్యంబుగ చాళ్లుకట్టుటను నారామేందిరా ప్రోల్లస
త్సీమంతంబన నీ తమాలకుటజశ్రేణుల్ ప్రకాశించెడిన్

ఈ మధువాసనా లహరి యీ మధుమాస పికారవంబు నీ
కోమల మల్లికా మసృణ కుట్మల నిర్గత వాసనాపగల్
మా మనసుల్ దహించెడు కుమార సమీర తరంగపాళి మా
కేమొ విరోధి వర్గముననే సమకూడె నిదేమి చిత్రమో

ఎంత విరోధ భావము వహించిన నేమి మదంతరంబునన్
వింతలు పుట్టెబో ప్రకృతి భేదములేక సమానభావపున్
శాంతి ఘటిల్లె నా హృదయసారస ముద్ధత భావవీచికా
క్రాంతము సర్వవస్తుబహిరంతరనవ్యసదైక్య మందెడున్.

## సలీము

నేను గూడ బానిస జన్మమైన నెత్తితిని కాదు. నేను చక్రవర్తికుమారుడనై యేల పుట్టవలె? నేను చక్రవర్తికుమారుడనై పుట్టి యీ స్వాతంత్ర్యము లేక బ్రతుకుట కంటె బానిసనై పుట్టిన బాగుండెడిది. ఇప్పుడు నాకు బానిస యన నేమో, చక్రవర్తి యన నేమో తెలిసినది. ఇరువురును బానిసలే. బానిస నని చక్రవర్తికి తెలియదు. బానిస నని బానిసకు దెలియును.

ఇంతగా సంస్కారము కల్గినను నామనస్సున కింకను శంకారహితత్వము కలుగలేదు. ఉన్నయీ చక్రవర్తిత్వము తప్పుట యెట్లు? మనస్సు సమాధాన పఱచుకొన్న యీసమానత్వ మాచరణకు దెచ్చుకొనుట యెట్లు?

## కవి

భ్రూపుటంబున దృష్టి నిల్పుకొని యోగి
ప్రకృతి బహిరంతరంబుల పరిధవిల్లు
నాత్మతత్త్వంబు చూచి యాహా ప్రపంచ
మందగా రాని యానంద మనుభవించి

ప్రకృతి భేదమ్ముచే కట్టుబడిన నాళ్ల
తన మహావస్థ గని తన్ను దానె చూచి
నవ్వుకొని మున్గిపోయె నానందవార్ధి
సర్వవస్తుసమత్వంబు సంఘటిల్లె

మధుర మధుమాస మరుదెంచి మధుకరీవి
లాసరాగంబు లాశావికాసమయ్యె
దృష్టి మెచ్చుట బఱపిన నింత యనుచు
జెప్పగా రాని యానందసిద్ధి కలిగె

సలీము

మధుమాస వశమున బులకితమైన యీప్రపంచ మింత యా నందదాయకముగా నుండి నాలో నున్న యీ శంకామాలిన్యమును క్షాళితము జేసినది. ఇంతవఱకు సందేహావార్ధిలో నే నేల మహావాయుధూతనౌకవలె నల్లలాడుచుంటిని? దేవీ! అనార్కలీ! నీవే నామనస్సున కధినేత్రి వైతివి. భావిభారత చక్రవర్తినివి నీవేకాదా. నీకొఱకు నేను బానిస నయ్యెదను. నీవు లేని నాకీ రాజ్య మెందులకు? భోగము లెందులకు? దేవీ! సర్వము నీ కర్పించితిని. నాజన్మలో ప్రప్రథమమున నాదృష్టి నీ మీదనే తగిలినది. నీవు మహారాజపుత్రివి కానిమ్ము బానిసవు కానిమ్ము నాజీవితాంతమ్మును నీవే యధినాయకురాలవు. దేవీ! కటాక్షింపుము. ప్రియా! అనుగ్రహింపుము

## రంగము ౭

అ నా ర్క లీ

అజీజ్!

అ జీ జ్

అక్కా! నన్ను తమ్ముడా యని పిలువరాదా?

అ నా ర్క లీ

తమ్ముడా!

అ జీ జ్

ఊ!

అ నా ర్క లీ

నా కేమియు దోచుటలేదు

అ జీ జ్

ఏంచేత?

అ నా ర్క లీ

బానిసలమైన మన కేకోరికయు సిద్ధించదుగదా!

అ జీ జ్

ఏ కోరికో నాతో చెప్పు

అ నా ర్క లీ

ఇప్పుడు మన మెచ్చటికైన పోవలెనన్న నెట్లు పోగలము?

అ జీ జ్

ఎక్కడికైనాసరే కష్టం లేకుండా వెళ్లటానికి ఒకవుపాయం వుంది. అది నాకు తెలుసు

అ నా ర్క లీ

ఏమిటది?

అ జీ జ్

పాము యెన్నేళ్లు బతుకుతుంది? వెయ్యేళ్లు! తొమ్మిదివందల తొంభైతొమ్మిదియేళ్లు వచ్చింతరువాత దానికి రెక్కలు వస్తయి; అప్పుడది యెగిరిపోతూంటుంది. ఆవేళకి సరీగ్గా చూచి అది ఒకగజమెత్తు యెగిరిన వెంటనే దానితోక పట్టుకొని గుంజితే అది నీచెప్పినమాట వింటుంది. దాన్ని కాల్చి భస్మం చేసి కాళ్లకు బూసుకుని యెక్కడ కెళ్లాలని తల్చుకుంటే అక్కడ కెడతాం.

అ నా ర్క లీ

ఆ పా మెక్కడ కనంబడును?

అ జీ జ్

అడవుల్లోకెళ్లి వుండాలి మరి.

అ నా ర్క లీ

ఈ వసంతకాలములో నడవు లెట్లుండును?

అ జీ జ్

ఆకూత దేంది?

అ నా ర్క లీ

కోకిలది

అ జీ జ్

బుల్‌బుల్‌పాట బాగుంటుందా! దీనిపాట బాగుంటుందా?

అ నా ర్క లీ

రెండు బాగుండును.

అ జీ జ్

నాకు బుల్‌బుల్ పాటే బాగుంటుంది

అ నా ర్క లీ

నీవు నీ మనస్సులో నున్నది చెప్పుటలేదు.

అ జీ జ్

నేను చెప్పింది నీవు నమ్మకుండా నన్ను మాటి మాటి కెత్తి పొడిస్తే నేనేమి చెయ్యగల్గుదును. నిజంగా నన్ను యువ రాజు సలీంగారు పిలిపించి కొన్నాళ్ళనుండి యీ గౌరవం

చేస్తున్నారు. లేకపోతే నాకు యీ అత్తర్లూ దివ్యవస్త్రాలు యెక్కణ్ణుంచి వస్తై. మళ్లీ రేపు రమ్మన్నారు సలీంగారు.

అ నా ర్క లీ

ఎందుకు నిన్నాయన యిట్లు గౌరవించుట?

అ జీ జ్

నాకేం తెలుసు?

అ నా ర్క లీ

నేడు వెళ్ళెదవా?

అ జీ జ్

నీ యిష్టం, నువ్వు వెళ్ళమంటే వెళతా

అ నా ర్క లీ

ఇదివరకు నన్నడిగి వెళ్లితివా?

అ జీ జ్

అక్కా! నా వద్ద నెన్నియైన దుర్గుణము లుండవచ్చును. కాని రెండుమాత్రము లేవు. వ్యభిచారము, నీ యెడల ద్రోహము. నా తల్లిదండ్రు లెవరో నాకు దెలియదు. నీ తల్లి దండ్రు లెవరో నీకును తెలియదు. మన మిర్వురమును చిత్రమైన యీ రాజాంతఃపురములో బెరిగినాము. నీకు నాకు రక్త సంబంధము లేకపోయినను నీ వక్కవు, నేను తమ్ముడను ఐనా

ము. అందరుబాసిసలకు తలోకయిల్లువలెనే మన యిరువురకు నీయిల్లు ప్రసాదింపబడినది. నిన్ను నే నెట్లు ప్రేమించుచుంటినో నీ వెఱుగక పోలేదు. నీయందు నాకు గల గౌరవము నాలో నాంకే తెలియును. నా యనుకో దగినవా రెవరైన నున్నచో నా కీలోకములో నీవుదప్ప నెవరును లేరు.

అ నా ర్క లీ

తమ్ముడా! క్షమింపుము యథార్థము. తెలిసికొనుటకు గ్రుచ్చి గ్రుచ్చి యడిగితిని

అ జీ జ్

వెళ్ళుమనెదవా?

అ నా ర్క లీ

వెళ్ళుము. ఎందుకో ని న్నిట్లు గౌరవించుట కనుగొనిరమ్ము

అ జీ జ్

నా కేమియు తెలియుట లేదు

అ నా ర్క లీ

క్రమముగా నదియే తెలియగలదు. నిదురపొమ్ము

(అజీజ్ నిద్ర)

# అ నా ర్క లీ

అజీజ్ నిదురపోవుచున్నాడు. నేనేమో యౌవనములో వచ్చి ప్రవేశించితిని.

బానిసకూతున్నైన నే నెక్కడ! సకలభారత సామ్రాజ్యమునకు గాబోవు చక్రవర్తి యత డెక్కడ? ఏమి యూహాసౌధము! ఆకాశపుష్పము! గొంతుక యెండి యెండమావులలో నీరు గల్పించుకొనుచున్నాను.

ఈ వెన్నెలలు నన్నీచోటికి దఱుముకొని వచ్చినవి. కాని ఖర్మాచెట్టునీడ నిలిచెదను. ఈ చంద్రుడు చుట్టజుట్టుకొని పండుకొన్న గోధుమవన్నె త్రాచువలె నున్నాడు.

అజీజ్ లేచి నాకై వెదకునేమొ! పోయెదను. పోయి పరున్నచో నిదుర పట్టదు గదా! ఈతాప మెట్లోర్చుకొందును? ప్రథమ దర్శనముననే నా హృదయప్రవేశ మొనర్చితివి ప్రియా! అది స్వప్న వృత్తాంత మని యెంచుకొనుచుండ నృత్యశాలకు వచ్చి దానికి దోహదము చేసితివి. నా ప్రాణములు నీ వేల హరించుకొని పోవుచుంటివి? ఈ దీనురాలిని రక్షింపుము!

నీవు నాయందు కోరికచేతనే నర్తనశాలకు వచ్చితివని సమన్వయము చేసికొనుచుంటిని. అది తప్పేమో జగత్ప్రభూ! ఈ నీచురాలిని క్షమింపుము. బానిసనై తలకుమించిన యూహాలు చేయు నీతుచ్ఛురాలి నేమి చేసెదవు? ఉరితీయింపుము. బ్రతికి

యుండగనే యొడలిచర్మ మొలిపింపుము. బానిసలకు విధింప బడు శిక్ష లివియే నటగదా!

వసంతుడు

మీ తావులలో మునిగిపోయితిని
మీ తారుణ్యములందు జిక్కితిని
లేత వెన్నెలలు గ్రమ్ముకొన్న యవి
స్ఫీతమరందము లుద్భవిల్లినవి

పూలకన్నెలు

నీకంఠంబును కౌగిలించితిమి
నీకై దండలు పూనినారమును
నీకే యర్పణమైతిమి దేవా!
శ్రీకర! మోహన! ఆనందమయా!

వసంతుడు

చిలుపవానలకు పగువులుపెట్టిన సెలలయిసుకపొరలో
కలిసిపోవుదము పాటలుపాడుచు మలగిపోవుదము వనిలో

అనార్కలీ

ఈ వసంత రామణీయకము న న్నెంత మోహరించుకొన్నది! ఈ వనమ్మున నెచ్చట చూచినను పూవులు వికసించినవి. ఈ పుష్పకన్యకల యౌవనమందు వసంతుడు మూర్తీభవించి నాడు. ఈ వెన్నెలలో ఈ మధుమాసరాత్రులయందు ఈ

వసంతకాలమున ఈ పూవుల నెత్తావులు గుబులుకొన్నప్పుడు మనోహరా! నేను నీ వశ్యనైనాను.

ఆహా! ఆ సౌందర్య మేమని చెప్పుదును

స్థలకమలగంజనమ్ములగు నీపాదతలమ్ములు నా స్తనాగ్రములపై మోపుదు నెప్పుడు

నవశిరీషకుసుమ సుకుమారములైన యా జగత్ప్రభువు పాదములు నా చేతులతో నొత్తుదు నెప్పుడు

కమలినీ సబ్రహ్మచారులగు నా మనోనాయకుని చరణతలంబుల నా భావకుసుమంబుల సమర్పించుదు నెప్పుడు

రమ్యమోహనములగు నా కుమారచక్రవర్తి యడుగుజాడలు నే ననుసరింతు నెప్పుడు

ఆ మనశ్చోరుని సుకుమార వక్షస్థలమ్ము నా యెదుటొమ్ము నానుకొను నెప్పుడు

రమ్యమందార కుసుమ కేసరసహోదరమ్ములైన యా నాథుని భాగ్యబంధురసహజారుణలోచనాంతములు నేను ముద్దిడుకొనుదు నెప్పుడు

నా యీ ప్రాణము లాతనిపాదముల నర్పింతు నెప్పుడు

# భ్రమరి

అరుణ జలజాతరమ్య కేసరము లంటి
నవవిలాస రక్తచ్ఛాయ తవులుకొన్న
నామనోనాథు చెక్కులు నాకు చూచు
చుండనే దూరమైపోయె

ఇటుల చనినాడు తేనియ లిటుల తెచ్చి
నాకు నందిచ్చినాడు నానాథు డకట
మరల చనినాడు తమ్మిపూ వరయ మూత
వడి వియోగమ్ము నాకు సంప్రాప్త మయ్యె

అంతటి మనోహరాకారు నంతటి సుకు
మారగాత్రుని నంతటి మానసమ్ము
మధుర సౌందర్యవార్నిధి విధివశాన
నెడము పొంది నాప్రాణమ్ము లెట్లు నిలుచు!

ఈవిలాస చంద్రికలు తా మేమొ శిశిర
రమ్యములు వోలె వచ్చి నాప్రాణములకు
తెగబడెడు నీవియోగ మే తెంచునంత
తిరుగబడిరి స్నిగ్ధులును గూడ రిపు లట్లు

నాపతి హరించుకొన్న యీ నలినపత్ర
శేఖరంబులు విడలేక ఛిన్నమైన
యాశపై నాశ వదలక యకట యిట్టు
లీ పొలమ్ముల బడి భ్రమరించుచుంటి

అ నా ర్క లీ

నా వన్నియు వృథా వాంఛలేమో! మధురస్థలముల నుండుట చేత మధురభావము లుత్పన్నము లగుచున్నవి. జగత్ప్రభువు సలీము యువరాజెక్కడ ? బానిసను నే నెక్కడ ?

కో కి ల

ఈరసాల కిసాలయేత రాహారంబు
తా రుచించదు మాకు తరుణకంఠములకు
గొంతుకోయగనిమ్ము కూహూస్వనానంద
రావమ్ము మధునిర్ఝరమువోలె పాడదా!
ఈనాల్క తెగిపోవనీ పంచమము గాక
మానోట నింకొక్క స్వరము పుట్టదు సుమ్ము
అతిసుకుమార మోహనుడు మాధవు డిదే
విహరించుచున్నాడు విపినవీథులయందు.

అ నా ర్క లీ

నామనస్సు ప్రభూ! నీపాదారవిందములయందే చిక్కినది. తీసికొందమన్నను వచ్చుటలేదు. పెకలించినచో నెత్తురులు వచ్చునేమో! ఈ దాసిని క్షమింపుము. ప్రభూ! నెత్తురులే ప్రవహించనిమ్ము!

నీపదమ్ములయందు నిలిచియున్నది మనము
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ,
నిన్ను మన్నించుచున్నాను రా ఓ నాథ,
నిన్ను ప్రేమించుచున్నాను రా ఓ నాథ!
మరల ప్రేమింతువో మరల ప్రేమించవో
ఎంచి నే నది విచారించను రా నాథ!
నిజముగా నిన్ను భావించుటకై నను
తగనురా నాథ నీదాసికి దాసిని
ప్రాచుర్యమైన యత్యాచార మిది యెట్లు
నీచిత్తమునయందు నిలిపి మన్నింతువో!
ఈపాడుపుర్వు వాంఛించుచున్నది చూడు
గగనస్రవంతికాకమలినీమధురుచుల్

ఉషారమణి

ప్రాభాతవేళాశుభానిలమ్ములు వీచె
శిశిరసౌందర్యలక్ష్మీమోహనమ్ములు
ఈశుక్లపక్ష శర్వర్యంత చంద్రికల్
క్రమముగా నశియింపగాజొచ్చె నింతలో
ప్రాచీదిగంగనా బంధురహాసంబు
లీయుషఃకాలరోచిస్సు లావృతమయ్యె

అనార్కలీ

అహో! తెల్లవారవచ్చినది. అజీజ్ లేచెనేమో: పోవల
యును

రంగము ౮

అజీజ్

ఏమమ్మా! ఎట్లావుంది? జరమేమన్నా తగ్గిందా

అనార్కలీ

తగ్గలేదు. ఎచ్చటికో వెళ్ళి వచ్చితివి?

అజీజ్

ఎక్కడికీ వెళ్ళలా

అనార్కలీ

బజారునకు పోయి రెండు మామిడిపండ్లు తెచ్చి పెట్టెదవా?

అజీజ్

నే వెళ్ల లేనిప్పుడు

అనార్కలీ

నోరరుచిగా నున్నది. మామిడిపండ్లు తినవలెననిపించుచున్నది

అజీజ్

కోర్కెలకేం చాలా వుంటై; అవి అణుచుకోవటమే ప్రజ్ఞంటే

అ నా ర్క లీ

నా కేమియు కోరికలు లేవు

అ జీ జ్

ఇదేమిటి మఱి ?

అ నా ర్క లీ

జ్వరము వచ్చుటచేత నోటికి రుచి పోయినది

అ జీ జ్

మఱి యిదేమిటి?

అ నా ర్క లీ

ఏమిటది?

అ జీ జ్

సలీముగారు నన్నిన్నాళ్లటినుంచీ గౌరవిస్తున్నారే దానికి ఫలితం

అ నా ర్క లీ

అది యేమిటో చెప్పుము

అ జీ జ్

కనపట్టంలేదా? ప్రణయవృత్తాంతం

అ నా ర్క లీ

అవునుగాని నేడేమిటి అట్లు మాటాడుచుంటివి ?

అజీజ్

ఎట్లా మాటాడుతున్నా ?

అనార్కలీ

ఏటికంత కాఠిన్యము ? నావలన నేదైన దోష మున్న నది యిదని చెప్పుము

అజీజ్

నీవల్ల తప్పంటే నే నెవ్వరిని చెప్పేందుకు ? నీ అంతదానవు నీవు, నా అంతవాణ్ణి నేను

అనార్కలీ

నాయనా ! అట్లు మాటాడెద వేల ? నీ వనుకొన్న దోషము నావద్ద లేకపోవచ్చును. మన మిర్వురము నేకగర్భజనితులము గాకపోవచ్చును. మన పుట్టుకలు గూడ మన కొకరి కొకరికి దెలియకపోవచ్చును. కాని నాకు తల్లిలేదు, తండ్రిలేదు; బంధువులు నెవ్వరును లేరు. చక్రవర్తి నా యీ శరీరమున కధిపతి యేమో కాని నా యభిమానాదికములు నా యధీన ముననే యున్నవి. అవి నా తమ్ముడ వగుటచేత నా కన్న చిన్నవాడవైనను మగవాడవు కాన నా తండ్రివంటివాడ వనుకొని నీ యనుజ్ఞ లేనిది యెవరి యధీనములును కావు. నాయందు నీ వృథానుమానమునకు గారణము నీ వనుకొన్నట్లు మాత్రము కాదని గట్టిగా చెప్పుచున్నాను

అజీజ్

ఈ యుత్తరము యువరాజుగారు నీ కిమ్మని యిచ్చినారు

అ నా ర్క లీ

ఇదియేనా నీకు కోపకారణము ?

అ జీ జ్

అవును

అ నా ర్క లీ

అందులో నేమున్నది ?

అ జీ జ్

నేను చదువలేదు

అ నా ర్క లీ

ఎందుచేత ?

అ జీ జ్

ఆయనవద్ద నేనిది విప్పి చదువనని వొట్టుపెట్టుకొన్నాను

అ నా ర్క లీ

భగవంతుని మీదనా ?

అ జీ జ్

కాదు

అ నా ర్క లీ

ఎవరిమీద మఱి ?

అ జీ జ్

నే నెక్కువ గౌరవించు నొకప్రాణిమీద

అ నా ర్క లీ

ఎవరా ప్రాణి చెప్పరాదా?

అ జీ జ్

ఎవరా! అనార్కలీ.

అ నా ర్క లీ

మఱి అంతప్రేమగల నామీద నీ కీ కోపమెందులకు ?

అ జీ జ్

అక్కా! మనము బానిసలమే కానిమ్ము! యువరాజు మన కేల యుత్తరమువ్రాసియ సాహసింపవలెను ?

అ నా ర్క లీ

అది యెట్టియుత్తరమో చూచి తరువాత నాక్షేపించుదము

అ జీ జ్

చదువుము

అ నా ర్క లీ

నీవే చదువుము

అ జీ జ్

నీకే వ్రాయబడినది

అ నా ర్క లీ

అదుగో మరల నామాటయేమి?

అ జీ జ్

కాదులే చదువ వమ్మా!

అ నా ర్క లీ

నేను చదువను; నీవే చదువవలయును

అ జీ జ్

[చదువును ఉత్తరము]

"ప్రియురాలా !

నా యీసంబోధనమున నీకు కోపము వచ్చునేని నన్ను మన్నింపుము. నిన్ను ప్రథమమున నంతఃపురమున చూచిన నాటగోలె నాహృదయము నీయెడ బద్ధప్రేమమైనది. నాట నుండియు నిన్ను మరల నెప్పుడు చూతునా యెప్పుడు చూతునా యని దుఃఖించి మా తండ్రి వద్ద నృత్యము పరీక్షించుట కనుమిషమీద మరల నీదర్శనము చేసికొంటిని. నాడు నా యభాగ్యమువలన నీవు జ్వరపడియుండుట తటస్థించినది. నీ వట్టిస్థితిలో నుండియు నాడు వచ్చుటచేత నామీద నీకుగూడ ప్రేమ యున్నదనుకొంటిని. నేను కామాంధుడ నగుటచేతనే య ట్లనుకొంటినేని నన్ను క్షమింపుము

మనోహారిణీ! జీర్ణసుందరమైన యానాటి నీవదనమండల మి ప్పటికిని నాకన్నుల కంటగట్టినట్లున్నది. ఇంతవరకు నా దేహ

ములో ప్రాణము లున్నవన్న చో కారణ మానాటి నీమనోహర ప్రణయరూపము నాకు నిత్యసన్నిధానవర్తి కనుక నే

ఈదినమ్ములెల్ల నేను మన్మథాగ్నిలో వేగింపబడుచున్నాను. నీకొఱకు నే నొక్క మాట చెప్పవలసియున్నది. ఈమహాగ్ని దేవీ, మహా పవిత్రమైనది. నా హృదయ మిదివర కెవ్వరికిని దత్తము కాలేదు. నీవే దానిని హరించితివి. నీవు నన్ను మరల ప్రేమించుము; ప్రేమించకుము; నాజీవితాంతము నీయెడల తప్ప నామన స్సన్యథా చరించదు

నీవు బానిసవు. నేను చక్రవర్తికుమారుడను. మన వివాహము బహిర్గతమైన ముప్పువాటిల్లునందువా? అది నేను రాజ్యాధికారి నగువఱకు రహస్యముగా నుంచబడును. అప్పుడు దేవీ! మన మిర్వుర మొక్కసారిగా నేను కుడిపాదమును నీ వెడమ పాదమును భారతరాజ్యసింహాసనమున నుంచుదము. కాదీ లోపుననే మనసంగతి తెలిసి చక్రవర్తి నన్ను నిన్ను దూరము చేయ బ్రయత్నించునా భగవత్సాక్షిగా చెప్పుచున్నాను, నన్నును భారతరాజ్యలక్ష్మిని నెడబాపగలడు గాని నిన్నును నన్ను మాత్ర మెడ బాపజాలడు

ఈయుత్తరము ముగించుచుంటిని. దీనివలన నీకు కోపము వచ్చెనా తెలియజేయుము

ఇతడు జీవితాంతము మరల నిన్ను పలుకరించడు. జీవితాంతము బ్రహ్మచర్యమో లేక యేమగునో గతి. దయగలిగెనా సశాస్త్రీయముగ నిన్ను వివాహ మాడగలడు

సలీము"

అ నా ర్క లీ

అయినదా!

అ జీ జ్

అయినది

అ నా ర్క లీ

ఇందు నా తప్పేమియు లేదుకద?

అ జీ జ్

అక్కా! క్షమింపుము. నే నే పొరపాటుపడితిని

అ నా ర్క లీ

నాయనా! ఫరవాలేదు. నీ కింత యభిమానగౌరవము లుండుట నాకు సంతోషము కాదా?

అ జీ జ్

అక్కా! నీ వేదో దేవతామూర్తివి

అ నా ర్క లీ

ఈ యుత్తరమునకు సమాధాన మేమందువు?

అ జీ జ్

ఆ మహారాజు వివాహవిషయము ప్రస్తావించినాడు గాన నా కిష్టము. ఆయనయెడల నీవు సానురాగ వైతివేని, బానిసలము నిఱుపేదలయింట పెన్నిధి వచ్చి కూర్చున్నట్లు. కాని అక్బరు చక్రవర్తి జీవించియున్నంతకాలము మన బ్రతుకు త్రాచు కోరలమీఁది చెరలాట

అ నా ర్క లీ

నా కీ జ్వరము తగ్గినట్లున్నది చూడుము

అ జీ జ్

తగ్గినది

అ నా ర్క లీ

నేను స్నానము చేసెదను. నీవు మామిడిపండ్లు తెచ్చిపెట్టె దవా?

అ జీ జ్

డబ్బు లిమ్ము

రు సీ

మీ అక్కగా రున్నదా ?

అ జీ జ్

ఉన్నది

రు సీ

(లోనికి పోబోవును)

అ జీ జ్

(నవ్వుచు) లేదు

రు సీ

ఎక్కడకు వెళ్లినది ?

అ జీ జ్

స్నానముచేసి వచ్చుటకు చక్రవర్తి తోటలోని చెరువువద్దకు వెళ్ళినది— దేనికి ?

రు సీ

ఉస్తాదు పిలుచుకొని రమ్మన్నాడు

అ జీ జ్

దేనికి ?

రు నీ

ఏమో! వెళ్ళెదను

అ జీ జ్

కొంచె మాగుము

రు నీ

దేనికో చెప్పుము

అ జీ జ్

మీ రింకెన్నాళ్లు నేర్చుకొనవలయును?

రు నీ

అయిపోవచ్చినది. ఇంక నాలుగైదు రోజులేనట

అ జీ జ్

తరువాత నీ వేమి చేసెదవు?

రు నీ

నృత్యము చేసికొని జీవించెదను

అ జీ జ్

వివాహము చేసుకోవా?

రు నీ

ఉస్తాదు నాకై యెదురు చూచుచుండును. పోవలెను

అజీజ్

సౌందర్య మన్న పదార్థము చాల యుత్కృష్టమైనది. దానిని వృథాచేయరాదు. నీచముగా నుపయోగించనురాదు

రుసీ

బానిసలకు పెండ్లి యెందుకు?

అజీజ్

బానిసలు మనుష్యులు కారా?

రుసీ

పెండ్లి చేసికోవలయునన్న చక్రవర్తి యనుమతి పొందవలెను

అజీజ్

పొందవచ్చును

రుసీ

మాకు నృత్యము నేర్పించు చక్రవర్తి యుద్దేశ మదికాదు. ఆయన రాజసభలో నృత్యము సేయవలెనని. మేము వివాహము చేసికొన్నచో నది తటస్థించదు గదా!

అజీజ్

వివాహము చేసికొందుమన్న చక్రవర్తి యొప్పుకొను నని నా యుద్దేశము

రుసీ

నేను పోవలయును

అ జీ జ్

ఒప్పుకొన్నచో వివాహము చేసికొందువా?

రు నీ

ఈ నీచపుబ్రతుకుకన్న వివాహము చేసికోవలయుననియే యున్నది

అ జీ జ్

చేసికొన్నచో నెవరిని చేసికొందువు?

రు నీ

ఉస్తాదు నాకై యెదురుచూచుచుండును పోవుచున్నాను

అ జీ జ్

మాఅక్క యిప్పుడే వచ్చును. అదిగో వచ్చుచున్నది

రు నీ

ఏదీ? వచ్చుటలేదే

అ జీ జ్

ఇప్పుడే వచ్చును. నీ వివాహమునకు నీ యిష్టమేనా?

రు నీ

అనార్కలీ నాకు ప్రియతమురాలు. ఆమెయిష్టము

అ జీ జ్

నీవు ఒక్క అందకత్తెవే కాదు - మంచిదానవుకూడను

రుసీ

నేను మీఅక్కకన్న నందగత్తెనా?

అజీజ్

మాఅక్క యేమంత అందకత్తె? ఆమె సద్గుణోపేత

రుసీ

మీ అక్కయంత అందకత్తె యీపట్టణమున లేదట

అజీజ్

మా అక్కగారికన్న నీవే యందకత్తెవు

రుసీ

సరేలే; నేను వెళ్ళవలయును

అజీజ్

(చేయిపట్టుకొని) రుసీ! మాఅక్కగారు వచ్చువరకు నిందుం డుము

రుసీ

వదలిపెట్టుము

అజీజ్

ప్రియా!

## రంగము ౧౦

## వ స ం తు డు

ఇసుకతిన్నెలమీద నింపారుపువ్వొళ్ళ
పసమీరు చివురుదొవ్వల మీద విహరింతు
అంభోజకుసుమకన్యకల యౌవనముల
రంభావిలాసఛత్రముల నానందింతు
మాకందకుసుమకన్యాకపోలములందు
రేకెత్తు మల్లెల రేలందు నిద్రింతు
పరువు లెత్తుచునుంటి ప్రాకులాడుచునుంటి
తరుణసాయంసుసంధ్యారాగములయందు
చివురు శేఫాలికా సీమంతమునయందు
తవిలి క్రొమ్మించు ముక్తాహారములు గూర్తు
సాయంసమయ మందచారుమారుతములు
కోయిల నును తేనె కొసరించు పాటలు
పుష్పంధయానంద మోహన రావముల్
గీష్పతుల్ గూడ రాగిలు శుకాలాపముల్
నాకు పుల్కలు గూర్చు నన్ను మోహింపించు
నాకు నానందసంధానంబు గావించు

ఈమహాభోగమ్ము లెన్నాళ్లనుభవించి
ఏమి తృప్తియు లేదు నింతయా యని లేదు
ఈ మహానందవాహినులందు నీదాడి
యేమియు శ్రమ లేదు నిక జాలు నని లేదు

పుష్పకన్యకలు

మమ్ము కన్నోరగించి మాధవా వచ్చితే
నమ్మని స్నెడబాసినను జీవములు లేవు
నీవె లోకమ్మని నీవె ప్రాణమ్మని
నీవెంట వచ్చు మ మ్మెవెంట తఱిమెదు
రావయ్య మావెంట రమ్యమోహనమూర్తి
ఈ వనాంతములందు నెడ మేది విహరింప

వసంతుడు

మీకు నాకు నభేదమే లతాంతములార
నాకున్న యందమంతయు మీర యనుకొండు
ఇట నెండ కాసెదు నిట వాన కురిసెదు
చిటిపోటి సెలయేళ్లు చిందులాడ దొడంగు
రమణీయ పుష్పితారామసీమలయందు
సమ్మృతకన్యకలార యావుదము మన మెల్ల
రావె శేఫాలికా రావె యో మాగధి
రావె యో మాకంద రావె యో మాధవి
ఓనవమల్లె రావే నీవు నిలువకు
రానేరవటె నీవు రమణీయకురవకీ

ఒక్కరొకక్కరి చేతు లూని వేవే రండు
తక్కు వెవ్వరులె సౌందర్యంబు లందున
నేను పోవుచునుంటి పూని నావెనువెంట
రం డాడుకొందాము రండు భోగింతాము

## అ నా ర్క లీ

ఆహా! ఈ వనమ్మున వసంత మెంత శోభాయమానముగ నున్నది! ఈస్థలమ్ము నిర్జనముగా నున్నది. ఉత్తరము తీసిచదువుకొనెదను. 'అప్పుడు దేవీ! మన మిర్వుర మొక్కసారిగా నేను కుడిపాదమును, నీవెడమపాదమును భారతరాజ్యసింహాసనమున నుంచుదము. ఈ ప్రేమకు నే నేమి బదులీయ గల్గుదును? ప్రభూ! ప్రభూ! ఈదాసిమీద నీ కెందు కింత కృప ? ఇంత ప్రేమ కీదాసి యనర్హ

## చి లు క

ఈవసంతమునందు నేపండు చూచిన
ఏమి చెప్పుదు తీపియేకాని మరికాదు
నీవు చాటుగ జేసి నేదాగుకొన్నాను
నీవు చెప్పకు మేరితోను మాకందంబ

ఇన్ని పండులు తెచ్చి యేభుజించుదు కూర్మి
కొరికివేసెద నేను కోరనిపండ్లెల్ల
ఈకుర్రవాం డ్రెల్ల నేరుకొంచున్నారు
పోకుండ నే నేమొ కొరికివేసిన పండ్లు
నానోటి కెంగిలన్నది లేదు కాబోలు

నానుదుల్ నవమరందమ్ములు కాబోలు
నామాట లానంద నవ్యగీతమ్ములో
నామేనుసోగను సన్ననిపట్టు కాబోలు
నేను పల్కినయంత నిజముగా వన మెల్ల
పూని సమ్మోదాంబుపూరంబునఁ దేలె

అ నా ర్క లీ

ఈచిలుక యేమి ముద్దుగా పలుకు చున్నది! దీనిమాటలు వినినకొలంది నా కేమొ క్రొత్తభావములు పుట్టుచున్నవి. ఈ యుత్తరమునం దిచ్చట నేమో వ్రాయబడియున్నది. ఇది యిది వరకు చూడలేదు

'ఆనాడు నీవు పాడిన గీతమే నాకు జపముచేసికొను మంత్రమై నది.' ప్రభూ! ఇన్నాళ్ళదనుక తూష్ణీంభావము వహించిన యీ బానిస దండనార్హ. ప్రభూ! అప్పటి కిప్పటికి

నీపాదములయందు నిలిచియున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!

కో కి ల

ఈవసంతమ్ము చిన్నెలుతోచె నెల్లెడ
ఏవంక చూచిన నెంతో మోహనమయ్యె
బంతులుగట్టి యీ భ్రమరసంతానంబు
పరుగులువెట్టు పుష్పమరందముల కోర్కి

ఈలేడి ప్రాయమ్ము నెనసి రెక్కలలయ్యొ
ప్రాలేయబిందు చుంబనము గావించెడు
ఇంత వాయువు వీచెనో లేదొ యీలత
కౌగిలించినది శాఖాగ్రభాగమ్మును
ఈ రసాలకిసాలయేత రాహారమ్ము
తా రుచించదు మాకు తరుణకంఠములకు

అ నా ర్క లీ

అక్కటా! ఈవిరహబాధ నే నెట్లపనయింప గల్గుదును? మనో హరా, దయజూడు, దయజూడు

కో కి ల

ప్రకృతిలో పురుషుండు ప్రతిఫలించిన నాడె
సకలప్రపంచంబు సామరస్యం బందె
తావి పుష్పంబులో తన్మయత్వం బందె
తేనె లోపల తీపి భ్రమ్మరించుకుపోయె
చివురులో శ్యామలచ్ఛవి యంటుకొనిపోయె
ప్రవిమలచ్ఛాయలోపల శైత్య మేపారె
కవితలో శబ్ద మైక్యం బంది పొలుపెత్తె
పంచమస్వరములో భాసిల్లె రసధుని

అ నా ర్క లీ

మనోహరా, నీ స్వహస్తలిఖితములైన యీ పవిత్రాక్షరములు గల యీలేఖ నాకుచాగ్రములపై నుంచుకొని యీ తాప మపనయించుకొందును

కవి

ఈమధుమాసకోకిల లివేమిటి కోమల మాకరంద హా
హా మధురారవంబుల నహో పులకింపగజేయు నద్దెసల్
నామన సంత కంతకు ఘృణాకలితంబయి యీవసంత శో
భా మహనీయతా జలధిభంగములందున నూగులాడెడిన్

ఈమందానిల మెంత మంజులమొ తా నీ పుష్పవాటీసుమ
శ్రీమాహాత్మ్యములెల్లగొల్లగొనితా రెంబోసుధాభంగభం
గీ మంథానవికస్వరస్వర భవక్రీడానవానీత భృం
గీ మంజీర నినాదకంఠలహరీగీతంబు లూగించుచున్

అరయదర ప్రఫుల్లకుసుమాంతరలగ్న హిమాంబుపూరముల్
వరలు కవోష్ణమా జలజబంధుకరమ్ముల నాహృతంబులై
పొరవిరజిమ్మ నూత్నవధువుల్ వలె సిగ్గరిచానలై ప్రసూ
నరమణు లందవున్ విలసనమ్ముల వొల్చెడు లేతమొండలో

అనార్కలీ

ఈ ప్రకృతికి గూడ నామీద నింత వైరస్య మెందులకో !
మనోహరా, నీ ప్రాణనాయికను వచ్చి రక్షించుకొనుము. నీవె
జాగుచేసితివా దుర్మార్గుడైన యీ మన్మథుడు నీ మనోహారి
ణిని నీకు దక్కనీయడు

మన్మథుడు

న న్నెందుల కుపాలంభించెదవు?

అ నా ర్క లీ

నీ వెవ్వరవు ?

మ న్మ థు డు

నీవు న న్నిందులకు దూషించెదవు ?

అ నా ర్క

నీ వెవ్వరవో నిన్ను నే నెఱుగను. నిన్ను నేను పిలువలేదు. పాదుషాహీ యీానవోద్యాన మితరులకు జేరరాదు. నీ వెవ్వర విచ్చట కెట్లు వచ్చితివి?

మ న్మ థు డు

నన్ను నీ వెఱుంగవా? నేను నీలోననే చిన్ని యగ్నిశకలము వోలె నున్నాను. నీవు బాల్యము వీడి యౌవనావతరణము చేసి నదిమొదలు నీతోనే యున్నాను. నాకును యౌవనమునకును భేదము లేదు. నేను నేడు నీకు ప్రత్యక్షమైతిని

అ నా ర్క లీ

నేడు నా కేల నీవు ప్రత్యక్షము గావలెను? ఇన్నాళ్ళనుండి నీవు నాలో నుంటివా, నిన్ను నే నెఱుంగకుండుట యెట్లు?

మ న్మ థు డు

నీవు యువరాజు సలీమునుగూర్చి వలపుగొని విరహ మనుభ వించు చున్నావు

అ నా ర్క లీ

ఛీ, ఛీ, పిచ్చిమాటలు మాటాడకుము. లేనిపోని నిందలు మోపకుము

మ న్మ థు డు

ఏటి కట్లు మృషాపూర్తిచేసెదవు? వెన్నెలలోనుండి కాంతిని పూవులోనుండి తావిని నీటిలోనుండి రసత్వమును నెట్లు వేఱు చేయజాలవో యట్లే భావములోనుండి నన్ను వేఱుచేయ జాలవు. నిరంతరము నీ మనస్సులో నివసించుచున్న నేను నీ మనస్సులోని భావము తెలియంగకుండుట యెట్లు? నేను నీ మనో భావము తెలియగ ననుట నేను రసమును గానని జలమే జల ముతో వాదించుకొన్నట్లు

అ నా ర్క లీ

స్వామీ, నీ వెవ్వరవు ?

మ న్మ థు డు

నేను నీ మనస్సులో బుట్టినాను. నే నెవ్వరనో నీకే తెలియదు, నా కెట్లు తెలియును ?

అ నా ర్క లీ

ఇప్పుడు దేనికి వచ్చితివి ?

మన్మథుడు

నీవు ప్రేమించుచున్న యీ సలీము మనుష్యుడు. అతనికి జరా మరణము లున్నవి. నా మాట విని యతనిమీఁదియాస వదలుము

అనార్కలీ

ఇది నా కిష్టములేదు. నా మన స్సిదివరకే యీ మహాభాగునికి దత్తమైనది. నేను మరల దానిని గ్రహింపజాలను

మన్మథుడు

అటులైనచో నింకొకమాట చెప్పెదను. అతని యౌవనము శాశ్వతము కాదు. శాశ్వతయౌవను మరెవ్వరినైన వరించుము

అనార్కలీ

ప్రభూ, నేనును మనుష్యనే, శాశ్వత యౌవనను కాదు. అతనినే వరించెదను

మన్మథుడు

అతనికన్న నందమైనవానిని చూపెదను. అతనిని వరింపుము

అనార్కలీ

అతనికన్న నందగాడు పృథివిమీఁద లేదు

మన్మథుడు

అన్నిటికన్న నందమైన దేమిటి?

అ నా ర్క లీ

మనస్సు

మ న్మ థు డు

నేను మనస్సునుండి పుట్టితిని. అందుచేత నాకన్న నందముకల వాడు లేడు

అ నా ర్క లీ

మనస్సునకు రూపము లేదు. నీకు రూప మెట్లున్నదో నాకు తెలియదు

(వెనుకనుండి సలీము వచ్చి కనులుమూయును)

అ నా ర్క లీ

నాకనులు మూయకుము

స లీ ము

నాపేరు చెప్పుము

అ నా ర్క లీ

పేరు నీకే తెలియదాయెను. నాకెట్లు తెలియును ?

స లీ ము

నాపేరు నాకు తెలియకేమి? నాపే రనార్కలీమనోహరుడు

అ నా ర్క లీ

అనార్కలీమనోహరుడవు నీవు కాదు

స లీ ము

మీ రెవ్వరు ?

అ నా ర్క లీ

నీవే యెంఱుగుదువు

స లీ ము

తెలియదు చెప్పుము

అ నా ర్క లీ

నేను చెప్పను. నాకు సిగ్గుగా నున్నది

స లీ ము

నీవు చెప్పకుండ నుండలేవు

అ నా ర్క లీ

అవును సకలభారతసామ్రాజ్య భావిచక్రవర్తి సలీము

[సలీము మహానందమున చేతులు తీయును. అనార్కలీ నివ్వెఱ]

మ న్మ థు డు

మాకంద బాలపల్లవమునందలి భ్రాంతి
కోకిలాకన్యక కూహూస్వనము జేసె
మల్లికా సుమ మాకరంద ధునీ భ్రాంతి
చెల్లరే తుమ్మెద శ్రీగీతములు పాడె

అరుణ కేసరరమ్యమైన తమ్మిలమీద
పవనకుమారుండు పఱువఱ్ఱు వెస ద్రాక్ష
నిత్యకళ్యాణంబు పచ్చతోరణము నై
యత్యంతసౌభాగ్య మందె నీవనసీమ

పళ్లెమ్ములో పెట్టి ఫలరసంబుల నెల్ల
కళ్యాణమంజురాగము దీసె కోకిల
ఇంపు గుల్కెడు వన మ్మిది పెండ్లిపీటయై
చాంపేయ మంటప చారుతల్ ప్రకటించె

## రంగము ౧

ప్రవేశము - సలీము (ఆసీనుడై)

ప్రొద్దెక్కిన కొలంది యెండలు మండిపోవుచున్నవి. వసంత కాలము వెనుకబట్టినది

సేవకుడు (ప్రవేశించి)

జహాపనాహ్! తోటమాలీలు వచ్చిరి

సలీము

రమ్మను

(సేవకుడు నిష్క్రమించును

తోటమాలీలు ప్రవేశింతురు)

సలీము

ఏమి విశేషము?

తోటమాలి

ప్రభూ! తమరు చెప్పినట్లుగా నా రెండు మామిడికొమ్మలను గలిపి అంటుకట్టినాము. కాని తక్కువజాతియొక్క మాడి పోయినది

సలీము

అయ్యో! బ్రదికినచో నింకొక క్రొత్తజాతి మామిడిపండు బయలుదేరెడిదే. కానిమ్ము యథాశక్తికముగ బ్రయత్నించుదము. ఇంకొకసారి చూతుము. బ్రతుకనిచో నాశ వదలుకొందము

తోటమా

చిత్తము

(నిష్క్రమింతురు)

సలీము

వృక్షశాస్త్రము నాకు బాగుగా తెలియును. మామిడియంట్ల విషయము సమగ్రము. ఇది యేల మాడిపోవలె?

సేవకుడు (ప్రవేశించి)

జహాపనాహ్! శిల్పులు వచ్చిరి

సలీము

రమ్మను

(సేవకుడు నిష్క్రమించును. శిల్పులు ప్రవేశము)

సలీము

ఏమి విశేషములు! కూర్చుండుడు

౧ శి ల్పి

ఖుదావంద్! అనేకములైన పాకములుచేసితిని. గిలాబు చేసితిని. సూర్యరశ్మి కెండ నిచ్చితిని. గొడ్డలితాకునకు గిలా బాగుట లేదు

౨ శి ల్పి

ప్రభూ! రంగులు కల్పితిని. చిత్రించితిని. ఎండనిచ్చితిని. ధారగా నీళ్లు పట్టగా రెండుగడియ లాగినది. తరువాత నిలువ లేదు

౩ శి ల్పి

పాలగచ్చునకు ప్రయత్నించి మెఱుపు తళత్తళలు తెచ్చితిని. ప్రభూ! అగ్ని చూపించితిని. అది పోయినది

స లీ ము

ఏమిచేయుదుము? మరల మరల నదే ప్రయత్నించుడు. 'యత్నే కృతే యది న సిద్ధ్యతి కోత్ర దోషః.'

శి ల్పు లు

చిత్తము

(నిష్క్రమింతురు)

స లీ ము

ఈ విషాదమేఘములు నన్నేల ముసరు?

సేవకుడు (ప్రవేశించి)

జహాంపనాహ్! ఎవరో కవియట! తమ దర్శనార్థము వచ్చినాడు

(కవి ప్రవేశించును సేవకుడు నిష్క్రమించును)

కవి

జహాంపనాహ్! క్షమించుము. రాజులయొద్దకు వచ్చినపు డాశీర్వదించవలయును. కాని యాశీర్వదించుశక్తి నాకు లేదు

సలీము

ఎందుచేత?

కవి

ప్రభూ! నేను కవి నయియే పుట్టరాదు

సలీము

కూర్చుండుడు!

కవి (కూర్చుండి)

నా పూర్వజన్మసంస్కారముచేత ఛందోదేవి నా జిహ్వాగ్రమున తాండవించుచున్నది. శబ్దబ్రహ్మసాక్షాత్కారముగూడనైనది. నిత్యపరిచయమువలన ధారకూడ కుంటువడదు

సలీము

మఱి లోప మేమియును లేదే!

క వి

నే నానంద దేవత నుపాసించలేదు

స లీ ము

మరి విషాద దేవతనా యుపాసించితిరి?

క వి

ఆమెకును నాకే జన్మనా ఆరభ్య స్నేహము

స లీ ము

మతి యేగీతమైన పాడుము

క వి

నాకు వచ్చినవే విషాదగీతములు

స లీ ము

అదియే యొకడు పాడుము

కవి

అతిమనోహర మీా సుహాయంతనమున
నా హృదంతరమునుండి బాహిరిలెదు
నీ మనోహర భావమ్ము లెల్ల చెదర
నీ విషాద మేఘములు న న్నేల ముసరు?

మలయగిరి కందరోపాంత మసృణగంధ
సార తరుపత్రములలోన సాగులాడి
కదలి చనుదెంచు నీచల్లగాలివేళ
హా విషాదభావములు నన్నావరించు.

ఇదిగో పశ్చిమదిక్కున కృష్ణపక్ష
శాంబరీరమ్య చంద్రఖండంబు పొడిచె
అగ్నిశిఖవోని దందశూకాస్యవిషము
లొరయుచున్నవి హృదయకోటరమునందు.

స లీ ము

మధురతరముగానున్నది. స్వామీ! విషాదగీతమైననేమి? మీవుల బాగున్నది. విషములోగూడ నమృత మున్నది కావలయును!

క వి

అగు; విషాంభోధిలోగూడ నమృత మున్న
దాయమృతవాంఛజేసి దేవాసురులు మ
థించి చివరకు భాగముల్ తెగక తారు
తారె పోరాడుకొని శాంతిదూరులైరి.

ఈ మహాతృష్ణ కంతులే దెంతపొంది
పొందనట్టులుగా వగ పందుచుండు
ఈ దురాశామహాంభోధి నీదులాడు
మానిసియు తుష్టితీరమ్ము గానలేడు.

అమృతగాంగధునీ శీకరములచేత
సంభ్రమించుచు నున్న దీ షట్పదంబు
కొనలను పసిండిమెఱుగు గ్రక్కునదళాల
హైమ జలజాత మధులుబ్ధమై భ్రమించు

స లీ ము

స్వామీ! ఏమి కావలయునో కోరుకొనుడు

క వి

నేను ధనాశచే రాలేదు. యువరాజు సలీము మహారసికు డని జనప్రతీతి విని నాగీతములు రెండు నీ చెవిని వేసిపోద మని వచ్చితిని

స లీ ము

అనుగ్రహింపబడితిని

క వి

ఇం కొక్కడు:

కనులు మూసి హైమల తేక్షుఖండకోటి
బద్ధమధుకరీజ్యాశరభ్రమణ మెంతు
కనులు తెరచి హోమాగ్ని శిఖాప్రచుంబి
గగన తరుశేఖరమ్ములు గాలజూతు.

నిత్యకుండోత్థ తారాధ్వ నికమహోమ
వహ్నికాజ్వాలికా ప్రతప్తమ్ము లగు ప

రస్పర విఘట్టితాస్మ దుద్భ్రాంతహృదయ
చేతములు పండ కాలి రంజిల్లి పోయె.

ఈ మహోగ్రశిఖామండలీమహాగ్ని
గాలుచున్న నాహృదయము కానిపించు
నిప్పు డిందీవరమ్ముగా నిపుడు పుండ
రీకముగను కోకనదమ్మురీతి నిపుడు.

సెలవు తీసికొందును. మరల దర్శించెదను

(నిష్క్రమించును)

స లీ ము

అతిమనోహర మీసుసాయంతనమున
నాహృదంతరమునయందు బాహిరిలేదు
నీ మనోహరభావమ్ములెల్ల చెదర
నీ విషాదమేఘములు న న్నేల ముసరు

(తెరలో)

ఖుదావంద్! సాయంకాలమైనది

[తెర]

రంగము ౨

(ప్రవేశము - రునీ, అజీజ్)

రునీ

మనోహరా !

అజీజ్

ప్రాణప్రియా !

రునీ

నేను నిన్ను వివాహము చేసికొన్నాను. మఱి సభలలో నృత్యము సేయవచ్చునా ?

అజీజ్

చేయరాదు

రునీ

చక్రవర్తికి చెప్పకుండ బానిసలు వివాహము చేసికొనవచ్చునా ?

అజీజ్

చేసికొనరాదు

రు సీ

ఈ చేయరాని రెండును నేను చేయవలసి వచ్చినది

అ జీ జ్

ఎందుచేత ?

రు సీ

చేయరానిపనులు చేయుటవలన గలుగు శిక్ష ననుభవించు గీత మొగమున వ్రాయబడియుండుటచేత

అ జీ జ్

ప్రియా ! ఊరడిల్లుము. అంతశిక్షయే కలుగునేని నాకు లేని శిక్ష నీకు లేదుగదా ? సుఖములో మన యిర్వురిజీవితము లెట్లు ముడిబడినవో దుఃఖములోగూడ నట్లే ముడిబడనిమ్ము

రు సీ

నాథా !

అ జీ జ్

ఏమి ?

రు సీ

తనకు గలిగినబాధ నోర్చుకొనవచ్చును గాని ప్రియతములైన వారిబాధ యోర్చుకొనరానిది

అ జీ జ్

నా బాధ నేనే యోర్చుకొందును

రు నీ

ప్రియా! నీవు నేను నొకటియే. కాని యనార్కలీకి గలిగిన బాధ నే నోర్వజాలను

అ జీ జ్

భావిభారతసామ్రాజ్యచక్రవర్తిని, మా అనార్కలీ కేమి బాధ యున్నది?

రు నీ

అట్లుగాదు. పాదుషాహా నాల్గురోజులలో లాహోరునకు దేనికో ప్రయాణము గట్టుచున్నాడు. సకలపరివారముతో బోవునట యచ్చటకు. మావిద్య పూర్తియైన దని తెలిసి నన్నును నన్ననార్కలీని ప్రయాణము గమ్మని కబురంపినాడు

అ జీ జ్

మీచేత నక్కడ నృత్యము చేయించుటకా?

రు నీ

కాకపోయిన మే మెందులకు?

అ జీ జ్

భావిభారతసామ్రాజ్యచక్రవర్తిని సభలో నిలిచి నృత్యము చేయునా? చేయదు

రు నీ

కాని యేమి చేయవలయునో తెలియుటలేదు. ఈ వివాహ విషయము చక్రవర్తికి తెలియనైన దెలియవలెను. లేదా స్వత్వము చేయుట కనుమతించనైన ననుమతించవలెను

అ జీ జ్

తెలియజేసినచో నేమగును?

రు నీ

మొదల నీకు నాకు ప్రాణదండన తప్పదు. అనార్కలీకిగూడ తప్పదేమొ! సలీము రాజ్యభ్రష్టుడుగూడ నగునేమొ!

అ జీ జ్

ఆఁ!

రు నీ

అవును మఱి! అక్బరుచక్రవర్తి చండశాసనుడు

అ జీ జ్

కానిమ్ము. మాల్వీయును సలీముయువరాజును నీ విషయములు నిర్ణయించగలరు. మన మేమి చేయగలుగుదుము?

రు నీ

మాల్వీవద్దకు పోదము

[తెర]

## రంగము 3

(ప్రవేశము - అనార్కలీ, సలీము)

అ నా ర్క లీ

జహాపనాహ్! నమస్కారము

స లీ ము

దేవీ! నమాజుచేసితివా?

అ నా ర్క లీ

చిత్తము

స లీ ము

అజీజ్‌ను అతని భార్యయు క్షేమముగ నుండిరా?

అ నా ర్క లీ

తమదయవలన క్షేమముగనే యున్నారు

స లీ ము

మౌల్వీగారు ఖుషీగా నున్నారా?

అ నా ర్క లీ

చిత్రము

స లీ ము

కార్యాంతరములచేత నాకు వచ్చుటకు వీలు లేకపోయినది. మనోహారిణీ! క్షమింపుము

అ నా ర్క లీ

జహాపనాహ్! అంతమాటయా యీ బానిసయెడల ?

స లీ ము

దేవీ! నీవు యువరాజు సలీము భార్యవు, బానిసవు గావు

అ నా ర్క లీ

అనుగ్రహింపబడితిని

స లీ ము

ఏమి విశేషములు ?

అ నా ర్క లీ

ఏమున్నవి ప్రభూ! పదిదినములైనది తమదర్శనమై

స లీ ము

దేవీ! నన్ను గవుంగిలించుకొమ్ము

(ఇరువురును కౌగిలించుకొందురు)

స లీ ము

దేవీ! ఏమో విషాదముగ నున్నది నీ వదనచంద్రబింబము?

అ నా ర్క లీ

ఏమియును లేదు. తమకోస మెదురు చూచుచుంటిని. మీ రెన్నాళ్ళకును రాలేరు. ఈ వ్యాజమున నేనే వచ్చితిని

స లీ ము

'నజరానాలతో మేనా' యనగనే తెలిసినది. అందుకనియే నా యీ గదిలోనికి బట్టించితిని. అనివార్యము లయిన కార్యములవలన రాలేదు. ఏమియు ననుకొనకు

అ నా ర్క లీ

ఈ దాసి కంతగా చెప్పవలసినపని లేదు

స లీ ము

దేవీ! మాటి మాటికి 'దాసి', 'బానిస' యనకుము. నాకు మనస్సునకు గష్టముగా నుండును

అ నా ర్క లీ

ప్రభూ! ఈ బానిసమీద నీ కెందు కింత ప్రేమ?

(సలీము అామ్మపై నాని యేడ్చును)

స లీ ము

(ఊరడించి) ఇది యేమి? వృథాగా నేడ్చెదవు?

అ నా ర్క లీ

నా కేలొకో భయముగా నున్నది

స లీ ము

అయ్యో! ఎందుచేత! దేవీ! నాకు దూరముగా నుంటి వనియా! కొద్దిరోజులలో మన మిర్వుర మొకచోట నుండుట కే యేర్పాటు చేయుచున్నాను

అ నా ర్క లీ

ప్రభూ! ని న్నొక టడిగెదను

స లీ ము

మహా ప్రసాదము

అ నా ర్క

(సిగ్గుపడును)

స లీ ము

దేవీ! సిగ్గెందుకు? నీదాసుడు సిద్ధముగా నున్నాడు నీయడిగిన కోర్కె తీర్చుటకు

అ నా ర్క లీ

(సిగ్గుపడును)

స లీ ము

(గడ్డము పూని) నామీద నొట్టు. నీ వడుగదలచిన దేమో చెప్పుము

అ నా ర్క లీ

స్త్రీసహజమైనలజ్జ మాని యడుగుచున్నాను

స లీ ము

కానిమ్ము! అయ్యో! మరల మాని వేసితివి. ఇది యేమి సిగ్గు?

అ నా ర్క లీ

(ఏడ్చును)

స లీ ము

(ఓదార్చి) దేవీ! ఏల వృథా దుఃఖించెదవు? అడుగుము

అ నా ర్క లీ

ప్రభూ! నన్ను వివాహమాడితివి. నేను నీ కర్ధాంగినిగదా!

స లీ ము

అదియా! దేవీ! నిన్ను నేను వివాహమాడినది దివ్యమైన నీ ప్రేమ నభిలషించిగాని తుచ్ఛమైన యీశరీర సౌఖ్య మభిలషించి కాదు. నేను యువరాజును. భావిభారతమునకు చక్రవర్తిని కావచ్చును. అప్పుడు నీవు చక్రవర్తిని వగుదువు. అంతవరకు నీ కాస్థితి రాదు. నేను భారతరాజ్యసింహాసనమున నున్నప్పుడు

నీవు చక్రవర్తిని వైనప్పుడే నిన్ను నే ననుభవించెదను. అటుల గాకపోయిన నీ కేదో నే నొకయపకారము చేసినవాడ నగుదునని నాకు తోచుచున్నది.

అ నా ర్క లీ

ఏమి టాయపకారము ప్రభూ?

స లీ ము

నేను చెప్పలేకున్నాను

అ నా ర్క లీ

మఱి నన్ను వివాహామే యపుడు చేసికొనక పోయిరా?

స లీ ము

నీకు నాయందు సంపూర్ణవిశ్వాసము గలుగుట కట్లు చేసితిని. ఈ మన వివాహమురహస్యము జను లెఱుంగరు. ఇప్పటి యీ వివాహము నీ వెఱుంగుటకును భగవంతు డెఱుంగుటకును చేసితిని. జను లెఱుంగకుండ నీయౌవనము హరింతునా, నేను జారుడ నగుదును

అ నా ర్క లీ

ప్రభూ! నీరహస్యము తెలిసినది

స లీ ము

ఏమి టది?

అ నా ర్క లీ

నీకు నాయందుకన్న ధర్మమునందే యెక్కువ ప్రేమ

స లీ ము

నీకన్న నాకు ఎక్కువ ప్రియమైన వస్తువు, నీ యీ యలినీల మనోహరములైనకనులు సాక్షిగా చెప్పుచున్నాను, లేదు. ధర్మముచేత నిన్ను నా యందు మరింత దృఢబద్ధనుగా చేసి కొనుచున్నాను

అ నా ర్క లీ

ఇక నేనీ రాత్రి వచ్చినపని చెప్పుటకు సెలవిందు

స లీ ము

పూర్ణిమాచంద్రబింబసమాన మైన నీ వదనము నేను చూచి సంతోషించుటకు

అ నా ర్క లీ

చిత్తము. ఇంకొక పనికూడ నున్నది

స లీ ము

చెప్పుము

అ నా ర్క లీ

రేపు చక్రవర్తి లాహోరునకు ప్రయాణమటగదా !

స లీ ము

అవును !

అ నా ర్క లీ

రుసీయు నేనును నృత్యము చేయుటకు రావలెనట

స లీ ము

(మౌనము)

అ నా ర్క లీ

మీరు వచ్చిన చెప్పెద మనుకొంటిని. రేపేకాన నీ రాత్రి మీతో తప్పక చెప్పవలె నని యీ వ్యాజమున వచ్చితిని

స లీ ము

నీకు జబ్బుగా నున్నదని తప్పించుకొనరాదా?

అ నా ర్క లీ

రుసీ?

స లీ ము

(మౌనము)

అ నా ర్క లీ

భావి భారతసామ్రాజ్యచక్రవర్తిని నృత్యము చేయునా అని యభ్యంతర పెట్టుచున్నాడు మా అజీజ్

స లీ ము

రుసీమాత్ర మెట్లు చేయును?

అ నా ర్క లీ

తమరే విచారించుడు

సలీము

మనసంగతి జను లెఱుంగరుగదా!

అనార్కలీ

మనకు తెలియదా ?

సలీము

మౌల్వీగారిని సంప్రదించవలెను

అనార్కలీ

వారు మీతో మాట్లాడవలె నన్నారు

సలీము

రేపుమధ్యాహ్నమా ప్రయాణము ?

అనార్కలీ

అవును

సలీము

రేపుప్రొద్దున మాట్లాడెదను. నే నే మౌల్వీవద్దకు వచ్చెదను. నీ వీరాత్రి యిందే పరుండుము. తెల్లవారుకడ వెళ్ళవచ్చును. నీ నా శయ్యాపైన పరుండుము. నే నిందు పరుండెదను

అనార్కలీ

చిత్తము

(నిద్రింతురు)

## రంగము ౪

( ప్రవేశము - సలీము, అజీజ్ )

స లీ ము

భాయీ ! లాహోరిదియేనా ?

అ జీ జ్

జహాంపనాహ్ ! ఇదియే. తమ రిదివరకు చూడలేదా ?

స లీ ము

చూచితినిగాని జ్ఞాపకము లేదు. ఇప్పుడు ప్రొద్దుగుంక వచ్చినది వలె నున్నదే !

అ జీ జ్

చిత్తము

స లీ ము

రుసీగూడ వచ్చినదా ?

అ జీ జ్

రాక యెట్లుండగలదు ?

స లీ ము

నీ వనార్కలీని చూచితివా?

అ జీ జ్

చూచితిని

స లీ ము

ఎట్లున్నది?

అ జీ జ్

చాల సంతోషముగ నున్నది

స లీ ము

మొన్న రాతిరి చాల ఖిన్నయై యున్నది

అ జీ జ్

రేపురాత్రి కేనట నృత్యము

స లీ ము

చక్రవర్తి వచ్చినపని యైనదా?

అ జీ జ్

ఏమియును పనిలేదు. విహారార్థమే వచ్చినది

స లీ ము

అది యెవరిగుడారము?

అ జీ జ్

రాజా మాన్‌సింగుగారిది

స లీ ము

(ఆవైపుననే చూచును)

అ జీ జ్

జహాఁపనాహ్ !

స లీ ము

(మౌనము)

అ జీ జ్

చక్రవర్తిమీద మానసింగునకు కడువిశ్వాసము

స లీ ము

నేను రాత్రికి మౌల్వీగారిగుడారమునకు వచ్చెదను

అ జీ జ్

అనార్కలీయు, రుసీయు రావలెనా ?

స లీ ము

తీసికొనిరమ్ము

(తెర)

## రంగము ౫

( ప్రవేశము - అనార్కలీ రునీ )

అ నా ర్క లీ

నేను తప్పకుండ నృత్యము చేసెదను

రు నీ

యువరాజుగారును మాల్వీగారును ఒప్పుకొనకపోయినచో ?

అ నా ర్క లీ

చెప్పి యొప్పించెదను

రు నీ

ఏల యింతలో నిట్లు తిరిగిపోయితివి ?

అ నా ర్క లీ

ఏలనో నాకే తెలియదు

రు నీ

చెలీ ! నీవు నృత్యముచేసిన బాగుండదు

అ నా ర్క లీ

నేను తప్పకుండ నృత్యము చేసెదను

రు నీ

నా కేమియు నిష్టము లేదు

అ నా ర్క లీ

నాకు చాల ఉత్సాహముగా నున్నది

రు నీ

ఎందు కీ యుత్సాహము ?

అ నా ర్క లీ

వీణతంత్రులను నావిర్భూతమౌ గాన
మేలాగు పుట్టెనో యెవడు చెప్పగలండు ?
వాసాలలో గాలి పోసుకొని రొదచేయు
నాధ్వని యేలాగొ యెవడు చెప్పగలండు ?
చివురాకులో నున్న శ్యామలచ్ఛవి యెట్లు
చొచ్చెనో యెవ్వండు చూచి చెప్పగలండు ?

రు నీ

ఏమిటిది ?

అ నా ర్క లీ

సంగీతము

రు నీ

ఎందుకు ?

అ నా ర్క లీ

నా కుత్సాహముగా నున్నది

రు నీ

ఎందుల కింత యుత్సాహము?

అ నా ర్క లీ

నాలో నేలనో సంతోష మావిర్భూత మగుచున్నది. ఎందుకు నీ కింత సంతోష మన్న నే నేమి చెప్పగలను?

జలజల స్రవియించు సెలయేఱుకడ కేగి
సెలయేఱ! యేటికే చేసెదు గానమ్ము
తెలుపవే యని నీవు పలుకరింపుము దాని
సెలయేఱు నీ కేమి సెలవిచ్చునో రునీ!
జామపండులు తిని చక్కగా పలికెడు
నా మనోహరశుకం బద్దాని కడ కేగి
ఏమె యో చిలుక నీ వేల కూసెద వని
యేమైన నడుగవే యే మనునో రునీ!
అదుగో బుల్‌బుల్ వింతమైన నృత్యము సేయు
కదిసి నీ వేటికే కడగి నృత్యము చేతు
వదలవే యని నీవు పలుకరింపుము దాని
అది యేమి నీతోడ ననగలదో రునీ!

రు నీ

ఇంత విచారకర మైన వేళ నీ కేటికో యింత సంతోషము?

అ నా ర్క లీ

అగు మేను శాశ్వతమ్మొకొ సుఖమ్మొ దుఃఖ
మగు దుఃఖమే సుఖ మ్మగు నేది యెల్లనో
తెగులు మానిసి కేమి తెలియునే యద్దాని
సాగ సెల్ల కాలమ్మె చూపగల్గును రుసీ!

రు సీ

ఈసంగీత మిప్పటిలో నాపవాయేమి ?

అ నా ర్క లీ

పగుచుండిన సెలయేటివద్దకు పోయి
యాగిపొమ్మని యెవ్వ డానవెట్టెను చెప్పు
పలుకుచుండినయట్టి చిలుకవద్దకు పోయి
పలుకవద్దని యానపట్టె నెవ్వడు చెప్పు
నటియించు బుల్ బుల్ను నటియించవల దని
ఘటియించు నాజ్ఞ నిక్కడ నెవ్వడో చెప్పు
కాలక్రమేణ లోకమున సర్వమ్ములును
కాలపాశనిబద్ధగతి పోవు నాగును

రు సీ

నేను పోవుచుంటిని

అ నా ర్క లీ

పోయెదవా! పొమ్ము! ఒక్కటి చెలికత్తెవు; సహాధ్యాయి
నివి. రెండు నా తమ్ముని పెండ్లమవు. మన యిర్వురి బంధ
మును పెద్దదే! పోయెదనందువా! పొమ్ము!

పోనిచ్చ గలిగెనా పొమ్ము పొమ్ము బిరాన
రానిచ్చ గలిగెనా రమ్ము రమ్ము బిరాన
పోనో రానో నీకు బుద్ధిపుట్టినయట్లు
గాని నాచెప్పినకరణి చేతువె నీవు
నీవె పోదువా లేక నేనె పోదునా రుసీ!
నీవు నేనును గూడ నిలువజాలము రుసీ!

రు సీ

నేను వెళ్లుచుంటిని

[నిష్క్రమణ]

అ నా ర్క లీ

రుసీవెళ్లినది. కానిమ్ము

ఈ వీణతంత్రిలో నేలాగయినగాని
నే నైక్యమగు గీత నాకు వ్రాసెనో లేదో
కీచకమ్మున దూరి కెరలి గానము సేయు
నాగాలి నే నైన నెంత బాగుండును!
ఈచివురాకులో నెనయు నీలిమ యెల్ల
నే నౌదునా యేని యెంతబాగుండును!
తోచితోచని మహాదోషమ్ము నాయందు
దాచుకొన్నాను నిత్యము దేహ మను మిష
మట్టిలోపలనుండి మట్టి యుద్భూతమై
మట్టిలోపల జేరి మలగిపోవును తుద

అ జీ జ్ (ప్రవేశించి)

ఏమి టీపాటలు?

అ నా ర్క లీ

సంగీతము!

అ జీ జ్

ఇవి యెవరు వ్రాసిరి?

అ నా ర్క లీ

నేనే చెప్పుచుంటిని

అ జీ జ్

నీకు కవిత్వము వచ్చునా?

అ నా ర్క లీ

రాదు

అ జీ జ్

ఛందస్సు నేర్చుకొంటివా?

అ నా ర్క

లేదు

అ జీ జ్

అట్లైనచో కవిత్వము వ్రాయరాదు. తప్పులు పడినచో నావ
దలు వచ్చును

అ నా ర్క లీ

పరవాలేదు

అ జీ జ్

ఈపద్యములనిండ తప్పులే

అ నా ర్క లీ

అయిన నేమి?

అ జీ జ్

అందుచేత నీవు పాడవద్దు

అ నా ర్క లీ

నా నోటివెంట వచ్చుచుండగా నే నెట్లాపగలుగుదును?

అ జీ జ్

మౌనవృత్తి నవలంబించుము

అ నా ర్క లీ

నాచేత గాదు

అ జీ జ్

నేను వెళ్ళిపోవుచున్నాను

అ నా ర్క లీ

వెళ్ళిపొమ్ము

ఈ నదీజలము సంద్రాన కూడెనుగాని
నంబుజాస్త్రాగ్నిచే నావిరియై పోయె
కలిసికొన్నామన్న ఘనమోదమే కాని
యల విడిపోవుశోకాగ్ని నెవ్వడు చూచె
కలిసినప్పటిమోదజలధి వియోగాగ్ని
దహియించుకొనిపోవు తరుణమం దేమయ్యె!

(అజీజ్ నిష్క్రమించును)

అనార్క

మా అజీజ్ వెళ్లినాడు. సరే! వెనుక మా గురువుగారు నేర్పిన గీత మొకడు జ్ఞాపకము వచ్చుచున్నది

ఈనౌక యెచ్చోటి కేగుచున్నదో కాని
యానందధామమై యతిశయించెను చూడు
ఏ రేవునుండి తా నేగుదెంచునో కాని
మా రేవు సకలసంపదల కాకర మయ్యె

ఈమహావార్ధిలో నీదులాడెడు నౌక
ఏ మహావాయువు నెనయ కెట్లుండునో
ఈ నౌకసౌందర్య మింతింత యనరాక
నా నేత్రయుగము నానందంబునన్ ముంచె

మాలీ (ప్రవేశించి)

బిడ్డా! ఏమిచేయుచుంటివి?

అ నా ర్క లీ

చిన్నప్పుడు తమరు నేర్పిన గీతము నొక దానిని పాడుకొను చుంటిని

మా ల్వీ

ఇప్పు డెందుకు?

అ నా ర్క లీ

రాత్రికి పాడవలయునుగదా!

మా ల్వీ

ఏమి టాగీతము!

అ నా ర్క లీ

(పాడును)

మా ల్వీ

అకాలమున ,నీ కీసంగీత మెందుకు ?

అ నా ర్క లీ

నేను నే డేలనో సంగీతము పాడకుండ నూరకుండలేకున్నాను

మా ల్వీ

బిడ్డా ! దయ యుంచి మానివేయుము

అ నా ర్క లీ

స్వామీ! నాచేతకాదు

మా

నేను వెళ్లుచున్నాను

అ నా ర్క లీ

గురూ! నాకు చదువు చెప్పిన ఉస్తాదువు. పెండ్లి చేసినమాల్వీవి. నన్ను వదలిపెట్టి వెళ్లెదవా?

ఈ మహానౌక ఝంఝూమారుతము చేసి
ఈ మహాంబుధిలోన నెచట మున్గునొకదా
అరయ రమ్యంబు లీ తెరచాప లే గాలి
చిటిగిపోవునొ నామచిత్తమ్ము తపియించు
ఔను చూచుటకు మహారమ్యమైనట్టి
ఈ నౌకసైతమ్ము తా నెట్లు మునుగునో?
ఆరంభ మేవస్తు వైన పొందెనయేని
యారసిన దాని కంతమ్ము నున్నది

[మాల్వీ నిష్క్రమణము]

అ నా ర్క లీ

మా గురువుగారు వెళ్ళినారు

> భానిస నగు నేను భారత సామ్రాట్టు
> రాణివాసమున కైనాను చోద్యము చూడు
> ఉప్పుసంద్రంబున నుద్భవించినముత్య
> మప్పార్థివుని కిరీటాంచలంబున నుండె

సలీము

(ప్రవేశించును)

అనార్కలీ

(చూడక)

> లేగదూడలుగూడ తూగి వాంఛించని
> యాగడ్డిపోచ వాహినిలోన బడిపోయి
> ముఖరించు నీమహాంభోరాశి తరగల
> శిఖరడిండీరలక్ష్మి మనోజ్ఞతను దాల్చె

సలీము

ఏమిటి పాడుచుంటివి?

అనార్కలీ

(లేచి) జహాపనాహ్! దయచేయుడు

సలీము

(కూర్చుండును)

అ నా ర్క లీ

జహాపనాహ్! ఇప్పు డెట్లు వచ్చితిరి?

స లీ ము

నూర్జీగారితో పనియున్నట్లు నటించివచ్చితిని

అ నా ర్క లీ

దేనికి?

స లీ ము

మహానందమున నున్నావట. నిన్ను చూచిపోవుటకు

అ నా ర్క లీ

ఎవరు చెప్పిరి?

స లీ ము

అజీజ్!

అ నా ర్క లీ

సాయంతనమున నృత్యము చేయుటా, చేయకుండుటా?

స లీ ము

నీవు చేయుటకే నిశ్చయించితి వటగదా!

అ నా ర్క లీ

చిత్తము

స లీ ము

ఎందుచేత ?

అ నా ర్క లీ

మాల్వీగా రెంతవారో నృత్యవిద్యలో నే నంతదాన నైనాను. నా యీ నృత్యకౌశలము తమరు చూడలేదు

స లీ ము

ఆరోజున చూచితిని గదా!

అ నా ర్క లీ

ఆనాడు నాకు జబ్బుగా నున్నది. ఆనాడు నే నసలు నృత్యమే చేయలేదు. నేడు నా నృత్యము జగన్మోహనముగా నుండును

స లీ ము

నీ కెట్లు తెలియును ?

అ నా ర్క లీ

నా యిప్పటి యీ యుత్సాహమే న న్నట్లనిపించుచున్నది ఇక నేను మరల నృత్యము చేయుటకు వీలుండదు. ఈ నాడు నా ప్రజ్ఞ యంతయు సంపూర్ణముగా చూపించి విరమించెదను

స లీ ము

అట్లయిన నేటిరాత్రి తప్పకుండ నృత్యము చేసెదవన్న మాటయే

అ నా ర్క లీ

చిత్తము. తమరు మాత్రము విషణ్ణులై కూర్చుండకుడు

స లీ ము

కూర్చుంటినా, నీమందహాస మొక్కడు నన్ను మహానందాబ్ధి మగ్నుని గావించదా?

అ నా ర్క లీ

అనుగ్రహింపబడితిని

స లీ ము

(కౌగిలించుకొనును)

[తెర]

## రంగము ౬

(ప్రవేశము: సలీము, వంది)

### వంది

ఆది మిత్రోష్ణముల్ గడచిసంతన మధ్యమునందు భీష్మముల్
మేదురమల్లికాకుసుమసమేతములై యట స్వచ్ఛవాసనా
శ్రీదము లంతకంత శిశిరీభవదంగములైన గ్రీష్మవే
ళాదివసంబు లివ్వి సుఖలాలసదివ్యజనైక భోగ్యముల్.

విరచిత మల్లికాప్రసవవీథి చరన్మధుకృత్కుమారికా
పరిణతగానరమ్యములు భాసురముల్ శ్రమవారి దేహసం
చరదమృతానిలార్భక ప్రసాదిత సౌఖ్యము లంగనా మనో
హరదృగనంతకాంతి మధురాకృతు లీ దివసంబు లెంతయున్.

ఈ నవమల్లికాకుసుమ మెంతగ భృంగకుమారుచిత్తమున్
దీనతఁ బొందఁజేయు సముదీర్ణనిజాంచితవత్రనిర్గత
శ్రీనవమాధునిర్ఝర వశీకృతముం బొనరించి దివ్యగం
గానళినోదరభ్రమితగానము భృంగ మిదెంత చేలమో!

### సలీము

ఏమయ్యా! మీరు రాజపుత్రదేశస్థులా?

వంది

చిత్రము ప్రభూ!

సలీము

మీ రెవ్వరికొలువులో నున్నారు?

వంది

రాజా మానసింగుగారి కొలువులో

సలీము

నే డిట్లు వచ్చితి రేమి?

వంది

జహాపనాహ్! తమరిదయ సంపాదన కొఱకు

సలీము

మాదయ యెందుకు?

వంది

మహాప్రభువులు

సలీము

(మౌనము)

వంది

శ్రీమన్మంజులతాగ్రభాగముల వాసించెఁ లతాంతావళుల్
ప్రేమోద్దీపితలైన కన్యకల శ్రీకృష్ణప్రభాకేశ పా
ళీమధ్యంబుల నందమై తరుగు వోలే దీ వసంతాంత వే
ళామల్లీ లతికావితాన సుమమాలావాసనానిర్ఝరుల్

ఈభృంగమ్మిది యెంతబేలయొ కదా బృందారకాంభస్సర
శ్శ్రీభంగంబుల నూగెడుఁ కనకనీరేజమ్ములో తేనియల్
శోభించుఁ తనకోసమై యిటుల నిల్చుఁ తాను నైరంభసం
బాభూమీతటులందు తుమ్మిపువులం దన్నన్న! యీరీతిగా!

సలీము

ఇతడు మరల మరల నదేగీతము పాడుచున్నాడు. నా రహస్యము వ్యక్తమైనదా?

వంది

ఈక్షోణీస్థలి బాసి పద్మముల కెంతేశోకముఁ గూర్చుచుఁ
లాక్షారక్తిమ పోవ నల్లనగుచుఁ లాలిత్యముఁ వీడుచుఁ
ప్రక్షీణమ్మయి సాంధ్యరాగములు దిక్పర్యంతముఁ బోయెడిన్
పక్షుల్ శ్రేణులుగట్టి యంబరమునఁ బాఱుఁ చలత్పక్షముల్

ఉత్తమజాతిభృంగమ వహో! నిను మెచ్చగవచ్చు లెమ్మ నీ
చిత్తము నీచభావముల చెందదు చందురులేతవెన్నెలల్
పొత్తులుగా వయఃపటిమ పొందిన వెన్నెలపుల్గులింటిలో
జొత్తుల కాంతికిఁ సొగసి సోలునె? అన్న! కుమారభృంగమా!

స లీ ము

ఏమయ్యా! వందీ! ఇంక చాలును పొమ్ము

వం ది

సెలవు తీసికొందును! [నిష్క్ర]

స లీ ము

అనిర్భేద్యమైన యీ రహస్య మెట్లు బయలు ప్రాకినది? ప్రియా! అనార్కలీ! మనలో నీ రహస్యమును చెప్పువా రెవరును లేరే. నా చవహారా కనిపెట్టిన రాజభటులును, పురుషులును నీ విషయము కనిపెట్టిరా? నా ప్రియురాలి యెడ వైముఖ్యము కలిగించుట కిది పన్నబడినట్లున్నది. దేవీ! నా హృదయము నీ యెడలనే బద్ధమైనది. ప్రాణములు పోవలెను. నీయందు నేను చలించను. ప్రియా! నీ వనుమానించకుము ఈ రహస్యమే వెలికి ప్రాకినచో దీనికి తగినట్లుగా చక్రవర్తి యేదైనా విచారించడా! మా యనార్కలీయెడ ధూర్తముగ బ్రవర్తించెనా, ఏమి చేయవలయును? ఏమో! నా మనస్సు నిలుకడ తప్పినది. ఏమిచేయుదును? అయ్యో!

సే వ కు డు

[ప్రవేశించి] జహాపనాహ్!

స లీ ము

ఏమి?

సే వ కు డు

అనార్కలీ నృత్యము చేయ బోవుచున్నదట, ప్రభువులను రమ్మనుచున్నారు.

స లీ ము

(కోపము మ్రింగి) అప్పుడేనా ?

సే వ కు డు

చిత్తము !

స లీ ము

నే నింకను భోజనము చేయలేదు

సే వ కు డు

దేవరవారి చిత్తము

స లీ ము

కానిమ్ము! వచ్చియే భోజనము చేసెదను

[తెర]

## రంగము ౭

( ప్రవేశము: అన్నార్కలీ, అజీజ్, రుసీ, మాల్వీ,
సలీము, సేవకుడు )

స లీ ము

ఏమిరా ? మా తండ్రిగారు రాలేదేమి ?

సే వ కు డు

సౌధగవాక్షముగుండ చూచుచుందురట. నృత్యము ప్రారంభింపు మన్నారు

స లీ ము

మానసింగుగారైన రాలేదేమి ?

సే వ కు డు

వారికి శిరోభారముగా నున్నదట.

స లీ ము

తక్కిన సరదార్లును రాలేదే యెవ్వరును

సే వ కు డు

జహాపనాహ్! తెలియదు

స లీ ము

ఈ నృత్యము నేను చూచుటకేనా? అట్లైనచో నాగుడారము వద్దనే చేయించుకొనవచ్చును

సే వ కు డు

ఖుదావంద్! సార్వభౌములు గుడారమునుండి చూచుచున్నారు

స లీ ము

నేనును నా గుడారమునుండియే చూచెదను

సే వ కు డు

ప్రభూ! తమ రిందే యుండవలెను. వచ్చినవారు వెళ్ళగూడదని రాజాజ్ఞ!

స లీ ము

మే మేమి శత్రువులమా, మాకు తాఖీదులు చూపి మమ్ము బంధించుటకు?

సే వ కు డు

సేవకుని క్షమింపవలయును

స లీ ము

(కూర్చుండును)

సే వ కు డు

అనార్కలీ ! నృత్యము చేయుము

అ నా ర్క లీ

(తనలో) ఈ యవమాన మేమిటి ?

స లీ ము

నీవురా ఆజ్ఞ యిచ్చునది ?

సే వ కు డు

చక్రవర్తిగారి యాజ్ఞ నిర్వర్తించుచున్నాను ప్రభూ!

అ నా ర్క లీ

(సలీమువంక దిరిగి) ప్రభూ ! ఆజ్ఞయా !

స లీ ము

(తల వంచుకొనును)

# అ నా ర్క లీ

(నృత్యము)

నే నెవ్వరను నాథ నీ వెవ్వరవు నాథ
నేనె నీవును మఱి నీవె నేనును నాథ
ఈ దేహములు రెండు నింతభేదము చేయు
లేదు భేదము మహాలీల నీకును నాకు

కడలిలోపల నీరు కదలి యావిరి రీతి
వడి వానయై నదీవైఖరి కలయును
నీ నాదు భేదమ్ము నిర్ణయించగలేరు
హేనాథ! దివ్య విద్యానాథులునుగూడ

తెలిసి సుజ్ఞానదీధితులు గాంచు నొకండు
తెలిసియు నజ్ఞానతిమిర మొందు నొకండు
ఒక్కకొమ్మన పూవు లుద్భవించును రెండు
ఒక్కగాలి చలించి యొక్కచోట లయించు

నీ వెవ్వరవు నాథ నే నెవ్వరను నాథ
నీవె నేనును మఱి నేనె నీవును నాథ
ఈ దేహములు రెండు నింతభేదము చేయు
లేదు భేదము కృపాలీల! నీకును నాకు

(అనార్కలీ నవ్వును) (సలీము నవ్వును)

అ నా ర్క లీ

ఈదేహములు రెండు నింతభేదము చేయు
లేదు భేదము కృపాలీల! నీకును నాకు

సే వ కు డు

(ప్రవేశించి) జహాఁపనాహ్! చక్రవర్తిగారు రమ్మనుచున్నారు

(సలీము నిష్క్రమించును)

అ నా ర్క లీ

(ఆగును)

సే వ కు డు

(ఆమెను బంధించును)

[తెర]

## రంగము ౮

(ప్రవేశము : సలీము, నిద్రపోవుచు)

(వృద్ధసేవకుడు ప్రవేశించును)

వృద్ధ సేవకుడు

ప్రభూ! ప్రభూ!

సలీము

(లేచి) ఎవరు నీవు?

వృద్ధ సేవకుడు

ప్రభూ! నెమ్మదిగా మాటాడుము!

సలీము

ఎవరు నీవు?

వృద్ధ సేవకుడు

నేను

సలీము

నీవా! తాతా! ఇప్పుడు వచ్చితి వేమి?

వృద్ధసేవకుడు

నాయనా? ఏమి చేయుచుంటివి?

సలీము

నిద్రపోవుచుంటిని

వృద్ధసేవకుడు

మనస్సున కంత సుఖముగా నున్నదా?

సలీము

కొంచె మాందోళనగానే యున్నది కాని, మా నాయనగారి యాదరవచనముల చేత కొంచె మోదారినది

వృద్ధసేవకుడు

మీ తండ్రి యేమన్నాడు?

సలీము

మిక్కిలి సమాదరించి పంపించినాడు

వృద్ధసేవకుడు

నీవు ప్రమత్తత గలిగియుంటకా?

సలీము

విశేషము లేమో చెప్పుము

వృద్ధ సేవకుడు

అనార్కలీకి రేపుప్రొద్దున నురిశిక్ష విధించినారు

సలీము

(స్తబ్ధుడై పోవును)

వృద్ధ సేవకుడు

ప్రభూ! అనార్కలీ బ్రదుకగలదు

సలీము

(నిశ్వసించును)

వృద్ధ సేవకుడు

అనార్కలీని బ్రతికించుకొనుట నీ చేతిలో నున్నది

సలీము

(ఊరక చూచును)

వృద్ధ సేవకుడు

ఇట్లయినచో లాభము లేదు. ఈ రాత్రియే నీవు తొందరపడ వలయును

స లీ ము

ఇప్పు డేమి చేయవలయును?

వృ ద్ధ సే వ కు డు

ఏ ముు కారాగృహాధికారికి లంచ మిచ్చి యామెను వదలించు కొని దాటిపోవలెను

స లీ ము

ఆమె కురిశిక్ష యెందులకు?

వృ ద్ధ సే వ కు డు

నృత్యము చేయుచు నీవంక చూచి నవ్వినదట. రాజకుమారులను మోసము చేసి తనవలలో వేసికొన ప్రయత్నించుచున్న దట. అందు కని

స లీ ము

ఆహా!

వృ ద్ధ సే వ కు డు

మీ రిరువురును వివాహము చేసికొని రని వదంతి ప్రబలినది. ఇదివరకే యేవిధముగా నైన నామెను హరించగా బ్రయత్న ములు చేయుచున్నారు. రాజధానిలో నీ పని జరిగిన కల్లోలము గలుగు నని యీ యాజ్ఞ నీ యూరులో నిచ్చుట కిచ్చటకు వచ్చిరి

స లీ ము

ఈమాత్రము వార్త నా కిదివరకు చెప్పక పోతివా?

వృద్ధ సేవకుడు

చక్రవర్తి నా మీద కన్నువైచియే యున్నాడు. నే నెప్పుడు బయలుదేరి వచ్చినను నా కురిశిక్షయే. ఇప్పుడు కన్నోమలగించి యేమయినను సరే యని వచ్చితిని

స లీ ము

ఇప్పు డేమి చేయవలయును?

వృద్ధ సేవకుడు

కారాగృహమువద్ద నున్నవానికి లంచ మిచ్చుట దక్క యింకొక వీలే లేదు

[తెర]

రంగము ౯

[కారాగృహము] (ప్రవేశము: అనార్కలీ మూర్ఛిత సలీము)

సలీము

అయ్యో! ప్రియురాల! (మూర్ఛపోవును)

కావలివాడు

(ప్రవేశించి) ఆహా! ఇది యేమి? ఇరువురు నిట్లుండిరి? చక్రవర్తి కీయుసురు తప్పక తగులును (నీళ్ళు తెచ్చి చల్లును)

సలీము

(లేచి) దేవీ! (అనార్కలీని కౌగిలించుకొనును)

అనార్కలీ

(లేచి) మనోహరా! (ఇర్వురును కౌగిలించుకొని యేడ్తురు)

కావలివాడు

జహాపనాహ్! ఇట్లు మీ రిర్వురును దుఃఖించుచుండ నెట్లు? ప్రభూ! కాలము గడచుచున్నది

అ నా ర్క లీ

జహాపనాహ్! మీ రిచ్చటి కెట్లు వచ్చిరి?

స లీ ము

ఈ మహానుభావుని దయవలన

కా వ లి

జహాపనాహ్! మాట్లాడుట తొందరగా కానిండు. నే నిప్పుడే వచ్చెదను. కోడి కూయువేళకూడ నైనది

[నిష్క్రమించును]

అ నా ర్క లీ

అయ్యో! తెల్లవార వచ్చినదా! (ఇరువురును కౌగిలించుకొని యేడ్తురు)

స లీ ము

ప్రియా! ఏడ్చి యేమిలాభము? మనము పారి పోవుదము రమ్ము!

అ నా ర్క లీ

ఎచ్చటకు?

స లీ ము

ఎచ్చటకో!

అ నా ర్క లీ

ప్రభూ! నామూలమున నీకు రాజ్యనాశన మేల?

స లీ ము

నీవు లేకున్న ప్రాణనాశమున కొప్పుకొందునా?

అ నా ర్క

అయ్యో! (ఏడ్తురు)

కా వ లి

(ప్రవేశించి) జహాపనాహ్! ఇక దయచేయుడు

స లీ ము

నీకు రెండు లక్ష లిచ్చెదను, మమ్ము పోనిమ్ము

కా వ లి

అమ్మో!

స లీ ము

నీ కేమిభయము?

కా వ లి

ప్రభూ! రేపు నన్ను చర్మ మొలిపించరా?

స లీ ము

అట్లయినచో నీవుకూడ మాతో రమ్ము!

కా వ లి

కాదు! ప్రభూ! కాదు

(నిష్క్రమించును)

స లీ ము

ప్రియా! రమ్ము పోదము

అ నా ర్క లీ

వాడొప్పుకొనడు

స లీ ము

నేనొప్పించెదను గదా!

అ నా ర్క లీ

ప్రభూ! ఈ దాసికై మీ రింత త్యాగము చేయ నేల? నేను నశించిపోయెదను

(ఏడ్చును)

స లీ ము

ప్రియా!

(ఏడ్చును)

కావలి

(ప్రవేశించి) ప్రభూ! చక్రవర్తి వచ్చుచున్నాడు

సలీము

ఇప్పుడా!

కావలి

చిత్తము

సలీము

ఎప్పుడైన నిట్లు వచ్చునా?

కావలి

పెద్దపెద్ద ఖయిదీ లెవరైన నున్నప్పుడిట్లే వచ్చుచుండును

సలీము

నిజముగా వచ్చుచున్నాడా?

కావలి

నా నాలుక కోయుడు

అనార్కలీ

అయ్యో! హతవిధీ! (మూర్ఛ)

సలీము

నాకు భయము లేదు. నేను లేవను

కా వ లి

ప్రభూ! ఈ దీనునియందు దయ యుంచుడు!

స లీ ము

(అనార్కలీని చూచి) అయ్యో!

కా వ లి

ప్రభూ! ఇంతలో మరల రావచ్చును. చక్రవర్తిగారు వెళ్లిపోయినవెంటనే మరల వత్తురుగాని ఇక్కడనే యొక రహస్యప్రదేశ మున్నది. అందుండి మరల రావచ్చును

స లీ ము

నేను నడువలేకున్నాను. నన్ను తీసుకొని పొమ్మి!

కా వ లి

క్షమింపుడు

స లీ ము

(అవ్యక్తముగ) పరవా లేదు

[తెర]

## రంగము ౧౦

(ప్రవేశము: నలీము, సేవకుడు)

నలీము

చక్రవర్తి వెళ్లెనా?

సేవకుడు

లేదు

నలీము

నా నాల్క తడియారుచున్నది

సేవకుడు

దాహ మిత్తునా?

నలీము

వలదు. చక్రవర్తి వెళ్ళెనా?

సే వ కు డు

జహాపనాహ్‌! వెళ్ళలేదు. కొంచెము విశ్రమించుడు

స లీ ము

నా గొంతుక యెండిపోయినది

సే వ కు డు

ప్రభూ! కొంచెము దాహము పుచ్చుకొనుడు

స లీ ము

ఊఁ!

(సేవకుడు మత్తుమందు కలిపి సారా యిచ్చును. సలీము త్రాగి నిద్రపోవును)

[తెర]

## రంగము ౧౧

(ఇద్దరు కటికవాండ్లు ప్రవేశము)

### మొదటి వాడు

ఓయొయ్యాయి పెజల్లార !

'ఎక్కువోళ్ళతో పెళ్ళిళ్లు తక్కువోళ్లు
శేశికోరాదు సూస్తిరా శిన్నపడుసు
కుయ్యికుమనకుండ కత్తితో గొంతు కంట
కోశియేసినాము తెలిసికోండు మీరు!'

### రెండవ వాడు

ఓయొయ్యాయి పెజల్లార! మావోడు శెప్పిన మాట యినుకోండి

'మేము యేమి పాపాలు శేశేము కాని
బాబు యిల్లాగ యెట్టాంటివాళ్ళగొంతు
లేమి శేద్దము నాయనా యిట్టెకోత్తు
మెనక తీయము పాపాల కన్ని అయిన!'

మొ ద టి వా డు

జనముల్లార! తెలిశిందా!

'మేలి పడుసుది సక్కదనాల సుక్క'
శింతశివురంటి దిట్లాగ గొంతుదాక
సులికియేశాము గొప్ప యింటోళ్ళతోడ
తక్కువోళ్ళకు పెళ్లిళ్ళు తగవు తగవు

రెం డ వ వా డు

నిజమైనమాటకి బాబో! అళ్ళు ఈళ్ళు ఒకెత్తు ఆళ్లు అయితేనేగాని పెళ్ళిగాని తగవు కాని పెట్టుకో కూడదంటారు పెద్దోళ్ళు

'తేనెలాగుంది ఆ పసిదాని సెత్తు
రయ్యో నా శేతు లంటె యో యమ్మ! తల్లి
మా అలచ్చిమి దయ సూడుమా యిలాంటి
వోణ్ణి యేమి నిలుత్తుంది బొంది నాది?'

నా వంటోడికి పెళ్ళాం బిడ్డలు నిలవరు బాబో!

మొ ద టి వా డు

పడిశేవు లేవోయి. వూరుకో! ఎవడి రుత్తి యెవడు మాడు తాడోశ్ ఎవడో యెదవ నాయాలకాని. ఓయోయ్యాయి జనముల్లార!

'మీకు నిజముగా పేనాలమీద ఆస
అంటు వున్నదా సరి నాయమైన బతుకు
బతుకుడా నాది సురకత్తి వాడిమొనది
మొనకతీదు రాజాగ్గె శెల్లించి తీరు'

రెండవవాడు

ఓయబ్బ! కటికతన మంత నీకాడె వుందిరా!

సలీము

(ప్రవేశించి) ఎవరురా మీరు?

మొదటివాడు

ఎవరో పెబువల్లె వున్నాడురా?

రెండవవాడు

అవునురా!

మొదటివాడు

మేము కటికోళ్ళము సామీ!

సలీము

ఏమిటో కేక వేయుచున్నారు!

మొదటివాడు

(1-వ పద్యము చదువును)

౧౪ నలీము.

ఎవరురా ఆ చిన్నపిల్ల?

జన మొదటివాడు

బానిసోళ్లట బాబూ యెవళ్లో! అళ్లపిల్ల. రాజుగారి కొడుకు గారిమీద కన్నేసిందిట సామీ! రాజుగారి ఆగ్గమీద సంకెశాం సామీ!

నలీము

(రుద్ధకంఠుడై) ఆమె పేరేమిరా?

మొదటివాడు

మాకు తెల్దు పెబో!

నలీము

హా! హా! ప్రియా! (మూర్ఛబోవును)

మొదటివాడు

మన కెందుకు పదరా పోదాము

(కటికవాండ్రు నిష్క్రమింతురు)

నలీము

(లేచి) ఈ రాజపురుష వేషముతో నా కెందులకు? (ఏడ్చుచు దుస్తులు తీసివేయును) ఇట్లగు నని కలలోనైన తలంచక

నిగదా. (దుమ్ము కొట్టుకొనును.) నాకేమి నిద్రపట్టినది. దునిద్ర నాకెక్కడనుండి వచ్చినది? అయ్యో! నాకు కువ యిప్పుడు రావలయునా? (ఏడ్చును). నా ప్రియు లి బదులు నేనైన నురికొయ్య నెక్కియుందునే! అయ్యో? నా ప్రాణములు పోవుచున్నవి. (మూర్ఛపోవును)

(ఇరువురు సేవకులు ప్రవేశింతురు)

ఒ క డు

ఓహో! చూచితిరా? యువరాజుగారు!

రెం డ వ వా డు

పోయి యంతఃపురమున చెప్పుదము పద!

స లీ ము

(లేచి) ఎవరు మీరు?

రెం డ వ వా డు

ప్రభూ!

స లీ ము

ఓరీ! రాత్రి మత్తుపదార్థము గలిపి మద్య మిచ్చినది నీవు కాదురా?

రెండవ వాడు

కాదు! కాదు

సలీము

(వానిని పొడిచి చంపును) (మొదటివాడు పారిపోవును)

సలీము

ఓహో! ప్రియురాల! పోకు పోకుము. నేనుగూడ వచ్చు చున్నాను! (పొడుచుకొనబోవుచు) ఇదియేమి? ఇది మృత్యు దేవత నాల్కవలె నున్నది. (అని కత్తి పారవేయును) ఇది భూమి! ఇది యాకాశము. అనార్కలీ! నీవు భూమిలో దూరి తివా? ఆకాశమున కెగిరి పోయితివా? నేను పలుగులతో ద్రవ్వి సాధించెదనని నీకు తెలియును. భూమిలో దూరలేదు. ఆకాశమున కెగిరిపోయినావు. నేను నీవెంట నెగిరిపోయెదను. నన్ను ముద్దు పెట్టుకొమ్ము (నవ్వును). అనార్కలీ! అనార్కలీ! (భజన చేయును). ఎవ్వరు నీవు నాకడ్డము వచ్చుచున్నావు? అక్బరువా! ఛీ! ఛీ! ఆ కడకు బొమ్ము. నీవు నరమాంస భోక్తవు. నన్ను ముట్టుకొనకుము. ఏమి, నీవు నాకు తండ్రివా? నమస్కరించు చున్నను! వీ డెవ్వడు? రాజామార్ సింగా? ఎందుకురా వికారముగ నవ్వెదవు? పో! పో! నీ జాతిపౌరు షము ధ్వంసముకాను. నా జోలి నీ కెందుకు?

మాల్వి

(ప్రవేశించి) ప్రభూ! నీ కీ దీనావస్థ యేమి? (ఏడ్చును)

స లీ ము

ఎవరు నీవు నన్ను చూచి యేడ్చెదవు? పో! పో! నన్ను చూచి నవ్వుము! నే నెవ్వరనో యెఱుంగుదువా? నే నానందమూర్తిని. నేనును మా యనార్కలీయు తేజోరూపమగు నీ యనంతపథమున బ్రవర్తించుచున్నాము! నీకు కనబడుటలేదా?

మాల్వీ

అజీజ్‌ను రునీని నురితీసినారు ప్రభూ! ప్రభూ! (ఏడ్చును)

స లీ ము

ఉరి? ఛీ! ఉరిలేదు. ఏమియును లేదు. నేను పొడుచుకొని చచ్చినాను. నీవుకూడ చచ్చిపొమ్ము! లేదా, నిన్నుకూడ నురితీసెదరు. అజీజ్ యెవరు? నీ వెవరు?

నీవెవ్వరవో నాకు తెలియునులే నీవు పరబ్రహ్మవు. ఇక్కడ కేల వచ్చితివి? రమ్ము రమ్ము, మన మిద్దర మానంద మనుభవింతము

రా జ భ టు లు

(ప్రవేశించి) ఇదిగో ఆమాల్వీ; పట్టుకొనుము

మాల్వీ

ఆహా! చచ్చితిని

(రాజభటులు మాల్వీని బంధింతురు)

మాల్వీ

నన్నిచటికి తీసికొనిపోదురు ?

రాజభటులు

ఉరికొయ్యకడకు. వారును నీవును వరుసగా ముగ్గురిని నిలుచుండబెట్టి యురితీతురు. అక్కడ వారిర్వురికి నీవు మరల వివాహము చేయుము సరిపోవును

మాల్వీ

(పీడారి) అవును. అదియే శాశ్వతమైన వివాహము. పదండు పోదము

సలీము

మీరందరును పరబ్రహ్మ నాశ్రయించెదరు. దేనికి? నిత్యానందమైన పద మభిలషించియా? పొందుదు. ఆ పదము నేనందితిని. నేనుకూడ వచ్చెదను తీసికొనిపోదురా ? నేనును మా అనార్కలీయు వచ్చెదము

1 రాజభటుడు

(నిదానించి చూచి) ఓరి యువరాజు

2 రా జ భ టు డు

అమ్మా నీవు పోయి చక్రవర్తిగారితో చెప్పుము

1 రా జ భ టు డు

[నిష్క్రమించును]

(మాల్విని లాగుకొనిపోదురు)

స లీ ము

నేనుగూడ వచ్చెదను. నన్ను తీసికొనిపోరా? (నవ్వి) మీకర్మము; నే నవ్యయానంతానందపథమున తిరుగుచుండగా నన్ను మీరు తీసికొని పోరా? సరే పొండు; నా సామ్మేమి పోయినది. అనార్కలీ, రమ్మా; మన మిర్వురము చెట్టాపట్టాలు పట్టుకొని తిరుగుదము. ప్రియా! నీ వెంత మోహనమూర్తివి! మోక్షలక్ష్మివి నీవేనా? రమ్ము రమ్ము. నన్ను దృఢపరిష్వంగమున దేల్పుము

(రాజపురుషు లిద్దరు ప్రవేశింతురు)

స లీ ము

ఎవరోయి మీరు, దివ్యపురుషులా? దేనికో వచ్చితిరి? నన్నును మా యనార్కలీని దివ్యవిమానములమీద నెక్కించుకొని పోవుటకా?

1 రా జ పు రు షు డు

ప్రభూ! మేము సేవకులము. చక్రవర్తి పాదుషాహా తమ తండ్రిగారు తమ్ము దీసికొని రమ్మన్నారు

స లీ ము

(నవ్వి) నాకు తండ్రి యెవరు? ఛీ! ఛీ! పొండు; పోవద్దు పోవద్దు, నా వెంట రండు. మన మందరమును గలిసి యాకాశ మున దివ్యవిమానములమీద విహరింతము. మా యనార్కలీని మీరు చూడలేదు కాబోలును. మోక్షలక్ష్మి. ఆమెను చూచిన మీరెల్ల ముక్తులగుదురు. రావే! ప్రియురాల! రమ్మ! రమ్మ! నే నామోక్షలక్ష్మిని ప్రసన్నను జేసికొనె దను. ఇదిగో జపము చేసెదను. అనార్కలీ, అనార్కలీ, అనార్కలీ (అనుచుండును)

1 రా. పు

ఈయన కీ పిచ్చి యెట్లుపోవును?

2 రా. పు

పిచ్చివలననే బ్రతుకుచున్నాడు. పిచ్చి పోయెనా! ప్రాణములు కూడ పోవును

1 రా. పు

ఎందుచేత?

2 రా. పు

అట్టి మహాప్రేమ కదియే ఫలితము !

1. రా. పు.

అట్లుకాదు. పిచ్చి పోయెనా, సంపూర్ణముగా అనార్కలీని విస్మరించునట్లే చేయవచ్చును

2. రా. పు.

అల్లా తరముగాదు

1. రా. పు.

అటువంటి యౌషధము లున్నవి. అవి యన్నియు చక్రవర్తి యిదివరకే తయారుచేయించి యుంచినాడు !

2. రా. పు.

అట్టి యౌషధము లున్నవా ?

1. రా. పు.

ఏల లేవు ?

2. రా. పు.

ప్రకృతి వంచనముగా నున్నది; మనుష్యుని దుష్ప్రజ్ఞ భగవంతునియెడ నెంత యపరాధిని యగుచున్నది. ప్రభూ! క్షమింపుము

స లీ ము

క్షమించితిని. పో! నీపాపములు నశించినవి. మా అనార్కలీకిగూడ నీయం దనుగ్రహము గల్గినది

1. రా. పు.

ఈయన యిపుడు మనవెంట నెట్లును రాడు. ఈయన ననుసరించుచు నెచ్చట నీయన సొలసి పడిపోవునో అచ్చట నుండి తీసికొనిపోదము

2. రా. పు.

బాగున్నదిలే పద

(ఇరువురు నిష్క్రమింతురు)

స లీ ము

ఇదిగో! నాకు భగవంతుడు సాక్షాత్కరించు చున్నాడు! భగవతీ! నమస్కారము. ప్రియా! మనోహారిణీ! భారత సామ్రాజ్యభావిచక్రవర్తినీ! ప్రాణమా! దేవీ! అనార్కలీ! రమ్మ నా కౌగింటిలో నొదుగుము. — అదుగో! నా ప్రియురాలు! నా యొద్దకు వచ్చి నన్ను జూచి నవ్వి నన్ను కౌగిలించుకొనుచున్నది. ఆహా! ఆహా! సుఖము. ఆనందము. మాధుర్యము

కవి

(ప్రవేశించి) నీవా! తెలిసినది. నీవు యువరాజు సలీము. నీకు పిచ్చియెత్తినదికాదూ! అవును! అంత రసతన్మయతగల నీకేల పిచ్చియెతదు?

ము

నాకేమి పిచ్చి? నీకు పిచ్చి! నేను మహానంద మనుభవించుచున్నాను. నే నవ్యయానందస్వరూపుడను

కవి

"అగు శరీరమ్ముపైన వృథాభిమాన
మంతరించిన దుఃఖమ్మె నగును సుఖము
సుఖము దుఃఖమ్మె నగు మనస్సునకు నంతు
లేని యానంద మనుభూతమగును యోగి"

"మును విషాదాబ్దములచేత ముఖరితమ్మ
యైన నా హృదయాకాశ మంతకంత
శాంతమై శరత్కాల స్వచ్ఛగగనంబు
పోలె హంసాతిరమ్యమై పొలుచుచుండె"

"ఈ భవన్ముఖదర్శనం బెంతవరకు
నాకు నానందదాయినై నది? వియోగ
మనుచు సంయోగ మని భేద మంతరించు
నెప్పు డద్దియె శాంతిసూ హృదయమునకు

సలీము

నీ వెవ్వరవు? ని న్నెక్కడనో చూచినట్లున్నది. ఇన్నాళ్లుగా నవ్యయానందస్వరూపుడను నేనే యనుకొనుచున్నాను

కవి

ఆనాడు వచ్చి నా విషాద గీతములు వినిపించలేదా?

సలీము

ఓహో! అవును

నేనెవ్వరను? స్మరణకు వచ్చుచున్నది. సలీమును

(నిర్వేదముతో) కవీ! ఆ నా విషాదనాటకమునకు నాడు నాంది పాడి నేడు భరతవాక్యము పాడవచ్చితివా?

దేవీ! అనార్కలీ!

[మూర్ఛ]

[తెర]

